ఉ. "అక్కనమాదనల్ చెలఁగునందల మెక్క సరప్ప సాటికిన్
నిక్కుచుఁ జెప్ప కట్టపయి నిస్త్రపతన్ వెప నిల్చుమాడ్కిఁ" బా
రొక్కటరెంటఁ జామరులయొద్ద రహఃసుహనావధానమున్
జక్కనొనర్చిరన్నఁ దమసాటికి వత్తురె? తక్కఁగై సరుల్.

చ. అనవసరంపుఁ జివ్వకు సహాయువులై విఫలోరుశాఖ దార్
పెనఁగొని మున్నడించు పెను పేరుల నీటఁగలంచినట్టి రీ
వినయవివేకశాలు లికఁ బెగ్గెల రహస్థ్యలంబులన్
గొనఁగుటమాని యిష్టయిన 'గుంటురిసీమను' మ్రొక్కఁగాదగున్

క. సారతరహృద్య పద్యసు, ధారసనిష్యంది గీరతముబలె నరయన్
మీ రచిత, సీమ, సరసంబై రాజిలె నఖిలసూరు లౌనని మెచ్చన్.

రామడుగు సీతారామశాస్త్రి. 14-1-14

..."గుంటూరిసీమ" చేరినది ... మిక్కిలి శ్రమకోర్చి ఆయాపత్రికల యందలి విషయములను ముందెన్నడో గ్రంథము వ్రాయవలయునని సేకరించి గ్రంథము తయారుచేసినందువల్ల తమకు 'చాణక్య' లనుబిరుదు సార్థకమైన దానినిగా దలంచుచున్నాను. తాము నిజములని వ్రాయించిన విషయములెల్లను నేను పత్రికలయందు చూచినవగుటచే యిందుమీరెంత మాత్రము అనృతము వ్రాసితిరని నేతలంపను.

వేమూరి సుబ్బరామశాస్త్రి. ఆళ్లమూడి 6-6-13

గీ. అంతియేకాక నారాయణశాస్త్రి మొకఁడు,
బయలు వెడలి గుంటురిసీమ పటిమనెల్లఁ
జించిచెండాడి వెనుఁజూపఁ జేయునఁట! యిఁ
కేమిపురికెక్క గుంటూరి సీమపగ్గ.

గీ. కాన నారాయణాస్త్రమ్ము గ్రమ్మిరాలు
మూడుసేయక మున్నె సమ్మోదమలర
నారయన్ గోరినాడఁ గుంటూరిసీమ
లోని యుత్తరరంగమ్ము లోకవినుత.

తెలికెపల్లి రామచంద్రయ్య. 25-2-14

శ్లో॥ ...పూర్వరంగ మమలం దృష్ట్వాఽఖిలం మానవ
స్స్వాంతే మోదముపైతి సంత్యజతి శాఖాపక్ష పాతాదికం.

శ్లో॥ కాత్యాయన్యై సమస్తం ప్రకథిత మను జాత్యైక దేశ ప్రగల్భా
సూయాశాఖాభిమాన ప్రకటిత పశగాశక్త దౌర్జన్యజన్యం..."

శ్లో॥ ... శాఖాం విజానాతి హి నీతి బాహ్యకః॥

శ్లో॥ రాజ్ఞాంగృహేషు ధనశూన్యగృహేషు కుర్వంత్యుద్వాహకాంశ్చ విభవై
ర్నసమాస్స్యరేవ తద్వత్క్వచిత్వరచనా సుచసంతిబహ్వ్యః పాండిత్యవైభవ
మిదంతువిచారణీయం॥ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి. 4-4-1913

మండవల్లి, లింగాలపోష్టు, కృష్ణాజిల్లా.

మ. హరనారీచరణాబ్జచింతనమరందాసక్తహృద్భృంగ! యు
త్తరరంగం బెపుడబ్బునో? యనుచు నత్యాసక్తుఁడై వేంకటే
శ్వరదైవజ్ఞుఁడు దానినే మదిసదా భావింపుచున్నాఁడు కా
న రయంబొప్పఁగఁ బంప వేఁడెదఁ గవీంద్రా! ముద్రణంబైనచోన్.

ములుకుట్ల కోటీశ్వరః. 9-7-13 యింకొల్లుగ్రామం

..."గుంటూరుసీమ" యనుగ్రంథములు ఆరుకాపీలు V. P. ద్వారా తీసుకొంతతొందరలో నా అడ్రసుకుఁ బంపఁ బ్రార్థించెదను. ఉభయ భాషా కవిత్వ మహాకవులగు తాముప్రకృత చర్యనంతయు కలికాలముపై ద్రోసివేసి... వంతలో ... మాహాత్మ్యము... అధికమగుననియు, పెద్ద లనుకొనుటను విని విశదపఱచు కొంటిని

మన్యం సీతారామయ్య. 2-4-13
టీచర్. టవును హైస్కూల్ గుంటూరు.

...గుంటూరుసీమను చూచినాను అందు నిజానిజములు తప్పక తేలుచున్నవి. యిట్టి సత్యమును దెలుపు యీ పొత్తము దేశమంతటను వ్యాపింపచేయుటకు భగవంతుని సదా ప్రార్థింపుచున్నాను.

బొడ్డుపల్లి శేషయ్య బోర్డుస్కూలు, మాష్టరు. మండపాడు 27-3-13

స్థాలీపులాకన్యాయమునఁ జూపితిమే, కాని మాయొద్ద నున్న సామగ్రిలో వెన్నవంతుగాని కైకొనలేదు, సరికదా వారి నామములఁ గూడ నుదాహరింపలేదు, పాఠకకర్మము ప్రతివిషయమునకును గ్రంథవిస్తరభీతియే మమ్ము నెను... తీయించుచున్నది. పీఠికలో నక్కడక్కడ నుదాహరించిన ప్రతివిషయమును నేదో యొకటితక్క నిట్టే లవలేశముగాఁ గైకొనినదియే కాని యేదియును బూ

తిన్నగా కైకొనలేదు. ఈలోటు రాఁబోవు 'నమస్కార' గ్రంథపీఠిక తీర్పఁగాక యని యింతతో విరమించుచు నిఁక నిందలి తప్పులంగూర్చి కొండొక చర్చించుచున్నారము. ఎచ్చటనేని యతిప్రాసములు, వ్యత్యస్తను లగుటంగూర్చి ప్రాజ్ఞులు గణింపరు. అవి భ్రాంతిమూలకము, అనివార్యము, దానింగూర్చి యితరులకు గోచరించినంత గ్రంథకర్తకు గోచరింపదు. ఆవిషయము కనిపెట్టుటకుఁ బాండిత్యముతో నవసరములేదు. యతిస్వరూప, ప్రాసస్వరూపములను దెలిసికొనుటకు సరిగా 5 నిమేషములకన్న నెక్కుడుకాలము పట్టదు అట్టి స్వల్ప విషయమును గూర్చికూడ దిసంతులు గొట్టువారు నేఁడు బయలుదేఱుటచే నీకాలముయొక్క దుస్థితికిఁ జాల విచారపడవలసియున్నది. పరిష్కృతము, హితకారిణి మనోరంజనులు నూఁకుఁ దప్పులు చూపవలయుననియెంచి పైరీతి తప్పులనే యన్వేషించి యవాకుచవాకులను వదరుచున్నవి. ప్రథమముద్రణమునందలి స్ఖాలిత్యము నిటీవల పరించితిమను మాటకూడఁ బాటింపక యీపత్రిక లూరక ప్రోఁగువెడు లిడుట మఱియును విచారణీయము. స్వాత్మదౌర్బల్యప్రకటనమునకై తమంతఁ దామే పలువిధముల సాక్ష్యము నిచ్చుచున్న యీపత్రికలు చూపు తప్పులెట్టివో తెలుపుటకుఁ బ్రకృతగ్రంథమునుండి కొన్ని యుదాహరించుచున్నారము.

"వి। ద్యామహేంద్రులు పశ్యశబ్దముపైని సారెకుఁ గొంపఱు

ఇందు విశ్రమము పొరఁబడినది దీనింబట్టి యజ్ఞతను సమర్థింపనెంచుచో తి। నెం॥ కవులకు, యతియననేమో తెలియదని కాని, అక్షరజ్ఞానము లేదని కాని, మెఱుఁగవలసియుండును. ఈమాట విశ్వసింపఁజేయుట కడుఁగష్టము. ఇట్టి ప్రయత్నమునకుఁ బాటుపడువారి నేమనవలయును ? మఱియు,

డం। బలరు నియోగి వైదికులు పంచుచునుందురు.

(పూర్వరంగము 4 వ పుట 16 పంక్తిచూ)

ఇందుఁ బ్రాసము పొరఁబడినది, పైపద్యము రేఫప్రాసకము కావునఁ అలరు, ఒరయు, అందు, ఒందు, గా మార్చికొన్న సరిపోవచ్చును. యతివిషయమున 'పశ్యశబ్దము తప్పుగాదని నొందలు' అని సవరించుకోవలెను. ఇట్టి భ్రాంతిప్రయుక్తములగు స్వల్పలోపము లెందఱచేతనో యెన్నిసారులో సంస్కరింపఁబడుచువచ్చినను భారతాదులయందుఁగూడ నిప్పటికిని గ్వాచిత్కముగాఁ గానవచ్చుచున్నవన నస్మదాదుల లెక్కయేమి! భ్రాంతినశించినఁగాని యీలోపములు

...శింపవు. అది ప్రపంచముతో పాటుండఁదగినది, బ్రాహ్మణులుకూడ దానికి ...షులు. ఇది విషయాంతరము. ఇంకను వ్రాయవలసినవి చాలనంశములుగలవు. వ్రాసినవానివలనఁ దక్కినవి యూహించుకొందురుగాక. పూర్వరంగోత్తరరంగ ...ములలో సూత్రప్రాయముగా నాయావివాదకు సంబంధించిన యాదాత్ర ...ముద్పఁబడినది. ఆది ఆసనచర్చయు, అంతము వేమవరావధాన ప్రయుక్తమగు ...ఖ్యానమును నని యెఱుఁగనది, ఆసమ్మానసమయమునందలి పద్యములు మాత్ర ...ముదాహరించి విరమించుచున్నారము.

చ. తిరుపతివేంకటేశ్వరసుధీకరయుగ్మ మలంకృతంబు చే
సిరికద! కంకణంబులఁ బ్రసిద్ధులు నల్వురు చెన్నయాము ల
బ్బురమును సంతసంబు నెదఁ బొంపిరివోవఁగఁ జూచుచున్న యం
దఱనయనంబులం దవి కనంబడుచున్న వదేమి చిత్రమో.

తి॥ శా॥

ఉ. గోడకు వెల్ల వేయుటది గోడహితమ్మును గోరి కాదు మో
మోడి భవత్కుతూహలము నోమఁగ సింగపుమేల్మిబంగరుం
బోఁడిమికంకణమ్ము లివి పూనుచునుంటిమి యిందు కర్హుఁడె
వాఁ డెవఁడో యెఱుంగఁగల ప్రాజ్ఞులు మృత్యులు నేఁడు చూడఁగన్.

వెం॥ శా॥

శ్రీమత్పరదేవతాయై నమః.

# గుంటూరిసీమ - ఉత్తరరంగము



శ్లో. ఉన్నతం పద మవాప్య యో లఘు, ర్హీలయైవ న పతే దితి బ్రువం
శైలశేఖరగతో దృషత్కణ, శ్చారుమారుతధుతః పత త్యధః.

(రసగంగాధరము)

శ్లో. యద్యపి వదతి సరోషం, మృగపతి పురతోఽపి మత్తగోమాయుః
తదపి నకుప్యతి సింహో, విసదృశపురుషేషు కః కోపః.

(అలంకారశేఖరము)

శ్లో. సంత స్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యంత్రణా
స్సర్వత్రైవ జనాపవాదచకితా జీవంతి కృచ్ఛ్రం సదా
అవ్యుత్పన్నమతిః కృతేన నసతా నైవాసతా వ్యాకులః
కృత్యాకృత్యవివేకశూన్యహృదయో ధన్యో జనః ప్రాకృతః.

(కువలయానందము)

(సదుపదేశము)

చ. వలదు నియోగివైదికవిభాగము, కొంపలు మున్గు దాన, వ
ర్తిలుఁడు యథానుపూర్విగ, విధేయులు విద్యకుఁ గండు; శాఖకున్
బల మిడ నెంచి స్కంధమును బాయఁగఁ ద్రోచు టదేటి తెల్వి! పూ
ర్వుల హృదయం బెఱుంగుఁ డని బోధ యొనర్పఁ గదమ్మ, శాంకరీ !

చ. వలదు నియోగివైదికవిభాగము, వల్వ దసత్య గోష్ఠి, ము
గ్ధులను విదగ్ధులన్ సరిగఁ దూఁచెడి తక్కెడకై ప్రయత్నమా
వల, దపలాపముల్ గిలుక వల్వదు వల్వ దొటించు నంబ! శే
వలదురితంబుగా నడుచు వ్రాఁతల కాళ్ళ కురిన్ ఘటింపుమీ !

చ. వలవని కోర్కులం బడినవా రెవరున్ దుద నెగ్గ లేదు, యుగా
కలియెడఁ గూడ సత్యమునె కాంతురు గాని యసత్యమున్నఁ బే

ద్దలకుఁ బ్రవృత్తి లేదు, ఋజుధర్మము పట్టి చరింపుఁ డంచు మూ
ర్ఖుల నుసిగొల్పు పెద్దలకుఁ గొండొక బోధ యొనర్పు మంబరో !

## గ్రంథప్రవృత్తి.

ఉ. సత్య, మసత్య మంచు మనుజన్ముల మంచికిఁ జెడ్డకున్ సదా
దౌత్యము సేయుచుండెడి పదార్థములందొకదాని కింకొకం
డత్యయమున్ ఘటించెడి యథార్థపదార్థము నిల్ప యోగ్యులున్,
వ్రాత్యులు వేఱొకండు నిలుపన్ బ్రయతించుచునుండ్రు శాంకరీ !

చ. నిలిపిన నిల్వఁజాలని దనిత్య మసత్యము, నిల్వకున్నను
న్నిలిచి యొసంగఁజాలినది నిత్యము సత్యము, సత్వరప్రభా
కలన కదే నిమిత్త మది గావలెఁ గావున దానికై మహా
త్ములవచనంబు లూఁత గొని పుస్తక మియ్యది సేతు మంబికా !

ఉ. నోటుకుఁ గాలదోష మది నోటియెడన్ గొఱ గాదు, కాన నె
ప్పాటునొ యుక్తి సేయుడు నపర్ణత గల్గదు, తప్పుత్రోవలం
దాఁటెడివారి రజ్జులు వృథా, ఋణమిచ్చి యపర్ణుఁడున్ ద్విష
త్కోటి నెదిర్చి పేర్చి కవికుంజరుఁడున్ వెలుఁగొందు నంబికా !

మ. మనవాఁ డెవ్వఁడు ? సత్యమం బలుకు సంపత్కామి, యన్యం డెవం ?
డనృతం బాడెడి దేబె, యీనియతికిన్ న్యాయైకదృష్టుల్ శ్రుతుల్
దనియన్ మ్రొగ్గెద; రన్యులో, మొఱకులై "తాఁబట్టుకుండేటికిన్
జమఁ బాదత్రయమే" యటన్నుడికిన్ దాసానుదాసాగ్రణుల్.

మ. ధనమున్ జూడరు, వేషభాషలకు బందల్ వోలె లో జంక, రె
వ్వని కేగౌరవ మంతెకాని యధికత్వం బొప్పఁగాఁ బోరు, స
జ్జనులన్ దక్కఁ దదన్యులన్ మనమునన్ జర్చింపఁగాఁబోరు, ధీ
ఘను లంచున్ జననీ ! ఋతం బడఁచు ప్రాజ్ఞశ్రేణికిన్ దెల్పుమీ !

## పూర్వవిద్వన్నాగరికత.

శా. "మీవిద్దెల్ ధన మిచ్చి కొన్నయవి, మీమీ పోకలెల్లన్ ధనా
శావిద్ధంబులు, పూర్వనాగరికవిద్యాభ్యాసముల్ వేఱు, త
ద్భావస్ఫూర్తులు వేఱు, వారు మనకై దైన్యంబు గైకోరు మీ
త్రోవల్ వారికి సైప రాని" వని యుద్బోధింపుమీ శాంకరీ!

# ఉత్తరరంగము

శా. పూర్వాచారుల విద్దె నేర్చు గుణలుబ్ధుల్ వారి మర్యాదలే
సర్వోత్కృష్టముగాఁ దలంతు రిపు డాచారమ్ము లేమున్న వీ
దుర్వారుల్ గనఁబోరు, దూర్వ లెనయా దుర్వాసుతో నందు రో
శర్వాణీ! యిటువంటి యోగులను లక్ష్య మ్మేలసేయన్ వలెన్.

## టాటోటుకటకుఁడు

ఉ. కొట్టు నుపానహం బదియుఁ గొండొక కొంకు వహించు, నెవ్వనిం
దిట్టఁగ దానిఁ గట్టు నల దీనుని నాల్కయు వెక్కఁదీయు, నా
పుట్టుగు బమ్మచారి యెటుబొంకిన నేమగు? నట్టి చీపురుం
గట్టలు గిల్కు వ్రాఁతలకు గౌరవ మెక్కుడి దమ్మ! శాంకరీ!

మ. ఘటచేటీకరనీచకాచకలనాక్రాంతంబు కర్ణద్వయం
బఁట! నానానృతపాతకాంచితవృథాహంకారపంకాంకితం
బఁట! చేతం; బటువంటివాఁ డొకఁడు పే రాసించి టాటోటులన్
రటియింపన్ గటువౌనుగా కవియు ధీరవ్రాతముల్ చూతురే.

ఉ॥ "ఆవులు దూడలుం గలుగ నార్పులు గుంజల కేల?" తా నెవం
డీవిషయంబు నేమెఱుఁగు? నింతకుఁ దన్నెవఁ డీసడింపకే
పో విడుచున్? జరిత్రమున బొంకులు బూతులుఁగాడ నానొకో!
కావల మేడ! సత్యపుఁ బ్రకార మదేడ! పచింపు మంబికా!

ఉ. ఇట్టి వృథా ప్రజల్పకుల హీనపు వ్రాఁతలు కీర్తికామినిం
గట్టుడు నాపె "కాళ్ల కురి గ్గై" నటం చొకమూల నాఁగుచోఁ
బట్టపగంటఁ జుక్కలపరిభావము వెల్గకపోదు "తా దొగన్
రొక్టైయుఁ గాకపో, దొకనరుం డలతానును గాకపోఁ" డిఁకన్.

ఉ. వానిది నోరు గాద, యల వానిది నాల్కయుఁ గాద, తోఁచిన
ట్లేనరుఁడే నసత్యములనే సెగడించునో యట్టివాఁడు శ్రీ
జాని స్వనామమూనినను జందనమూనిన రాసభంబె, దూ
రానఁ బరిత్యజింతు రల వ్రాయసకాని నుడుల్ బుధాగ్రణుల్.

ఉ. ఉన్నది యున్నయట్టులుగ నోపిక మీఱ లిఖింతు మంబరో!
కన్నపువొంగ వ్రాఁతల ప్రకారము నోటికి వచ్చినట్లుగాఁ
బన్నము, బన్న మాగిలికు వ్రాయసకాండ్రి శిరాన నుంచి వి
ద్వన్నుతమైన మార్గమునఁ బంపెడి భారము నీది యీదెసన్.

(త్రిశంకుస్వర్గము)

చ. అతనిని రాఁగి యుండు రవఁ డల్ల వసిష్ఠగవిస్రవంతికై
మతిచెడి పోర నోడి మతిమత్తుఁడై తప మాచరించి బ్ర
హ్మత యొకకొంత గాంచె నల యాతఁడె గాధిజుఁ; డాతఁ డిచ్చె స్వ
ర్గతి నొక రాజసూతికి, సురప్రభుఁ డొప్పమి కాగ్రహించుచున్.

ఉ. గడ్డము మీసముల్ పెరిఁగి గాధిజుఁ జేయవు వేని నేని యా
చెడ్డ మునీశ్వరుం డొకని శ్రీపతియన్నను జేర్పఁ బోయి తాఁ
బడ్డ పరిశ్రమంబు భగవంతుఁ డెఱుంగుఁ, గృతార్థుఁ డయ్యెనే?
అడ్డఁడె యింద్రుఁ! డాపముకథాంశ మెఱుంగనివారు లేరుగా.

(పౌండ్రకవాసుదేవీయము)

ఉ. ఉండ్రు జగమ్మునందు మును పుండినయట్టులె యుండువారు పె
క్కండ్రు, వృథాభిమానమునఁ గర్జ మెఱుంగక కొంద ఱెట్లొ చే
కొం ద్రపమానమున్ దమకుఁ గూడని బల్ బిరుదుల్ ధరించి; యీ
*పౌండ్రక వాసుదేవుల నెవండు గణించు వచింపు మంబరో!

(గౌతమీనది — సెలయేఱు)

ఉ. కొండలు వ్రీల బండ లొగిఁ గొట్టుక పోవుచుఁ జేల గౌతమీ
చండతరప్రవాహ మది శాశ్వతమై భువిఁ బర్వ నెన్నియో
కొండలనుండి వచ్చి యడఁగున్ సెలయేళ్లట నూరుఁ బేరు లే
కుండఁగ "దివ్యటీసరస నుండెడి దీపములో" యనం బొరిన్.

ఉ. అంతన పుట్టు నంతటనె యాఱుఁ గడున్ రయ మొప్పఁ బాఱునొ
క్కింత వెడల్పుఁ బొడ్డు గల యే ఱదియే సెలయేఱు, దాని పై
నెంత? మహాప్రవాహముగ నెల్లపుడున్ బ్రవహించుచున్ బవి
త్రాంతరమై తనర్చెడి మహానది గౌతమియందు, శాంకరీ!

(చ్యవనమహాముని)

ఉ. కొండలు బండలుం గలిసి గొప్పగ నెంచి స్వపక్షపాత మా
ఖండలుచేతి కత్తి కిడఁగా గరుడుం డిడెఁ బక్షపాతియై
యుండియు నీకమాత్ర; మదియున్ జ్యవనుం డిడఁ; డాత్మశక్తి యి
ట్లుండు నటంచుఁ దెల్పుటకు నో జగదంబ! తృణీకరించుచున్.

---

* హరివంశోత్తరభాగము-ఆశ్వాసము 6.

క. తనబలము నెదిరిబలమును, గనని కతన వజ్రిమట్టి ఘనహేతియె కీ
ర్తిని గోలుపోయెఁ గొడవ, ళ్లని మొవ నటు లాచరింప నవి యేమగునో!

(కాళింగులు)

ఉ. అంగమునిండ భూతి నిడి, యల్పపువస్త్రము గట్టి, చెంబు కే
లం గొని శుద్ధసద్ద్విజులలాగు నటించుచు నెందుఁ బోవు కా
ళింగులపోల్కి నేఁ డకట! లేరు లనేకు లౌకిఁత నేరు పెం
దుం గనకే వధానిబిరుదుం దలఁదాల్తు రదేమి పాపమో!

ఉ. వేసము పొట్టకోస మెటు వేసిన వేతురుగాక. యీరసా
భాసులు నిక్కపుం ద్విజులఁ బట్టుక "మీరును విప్రులే? మిముఁ
భూసురు లంట తప్పు మముఁ బోరునఁ గెల్చినఁగాని మీకు మీ
భూసురనామ మొప్ప" దని మ్రోఁగుదు రేమిటి కంబ! శాంకనీ!

(లూత)

ఉ. అంబరమందు *సాలెపురు వాదరు వింతయు లేక వ్రేలుచుం
దం బొకయప్డు తోఁచు నది తథ్యమొ? కా, దటమున్నె యల్లియుం
చుం బహుతంతుజాల మది చూరున సంటుక యుండు, దాని దా
రంబు మొగంపుదారపుఁ బరంపరతోఁ గలుపన్ దిగంబడున్.

ఉ. నేయును గాత లూత యది నేర్చిన నేతగఁ బొట్టకోసమా
నాయము; బట్టకోసము జనంబు కువిందుని గోరుఁగాని యా
మాయపుఁబుర్వు నేతకయి మానస మెంచునె? యుంచుఁబో, యెటో
కాయమునందుఁ గప్పికొనఁగా నది వచ్చునో! మట్ట విచ్చునో!

---

*21 వ సెప్టెంబరు 1912 సం॥ కృష్ణాపత్రికనుండి

ఈఁగపులి

తే. కీటకములందు మిక్కిలి కీర్తిగంటి। నీఁగపులి యందు రఁదలు నెలమి వన్నె। గాదె యంచును మది వృథా గర్వపడకు। సరసు లది విన్న నగుదురు సాలెపురుగ! కపటమున నేదొ యొక పన్ను గడను బన్ని। యీఁగలను మోసపుచ్చుట నీఁగపులివి। కాని యెదురుగ నిలఁబడి కలనఁ గెలిచి। పేరుపొందిన దేదిరూపింప లూత!।ఎట్టులో యొకరీతి నీ కీబిరుదము। కలిగె నామాట లటులుంచు కలిగినంత। మాత్రమున నూర్ణనాభ మామదిని మివులు, । తలనుదాఁటిన గర్వంబు

# గుంటూరి సీమ

ఉ. అల్లిన దానిచే మరల నల్లును, గ్రొత్తవిధాన నల్లఁగాఁ
జెల్లదు సాలెపుర్వునకుఁ జేతయుఁ గాదది యెన్నిసారులే
నల్లిన యల్లికే మరల నల్లెడి; దానికె సంతసింతమా?
యల్లిక యెందుకేని గొఱయైనది గాదుగదా మహేశ్వరీ!

(నీరసాశుఘోషానిరసనము)

చ. ఎఱిఁగియుఁ గ్రొవ్వుపుం గయిత కేమును బాల్పడఁబోదుమేమొ! కొ
ప్పర మొకవేళఁ బోరికి సభాస్థలికిన్ జనుదెంచెనేని; శాం
కరి! యది కాము కూడదని కంకకుమమ్మ! ప్రసక్తి దీరు ను
త్తరపు క్షణంబునన్ మరల దానిఁ ద్యజించెద మాజ్ఞ యిమ్మొగిన్.

చ. ఎలమిఁ దురుష్కునిం దగిలి యేగిన నాతికిఁ బ్రీతిఁ గొల్ప మొ
క్కలుఁడు దురుష్కతాప్తికయి కట్టెఁడిమార్గముఁ బట్టు భంగి వెం
గలులకుఁ బ్రీతిగొల్పఁ గల కాకవితం బురుడింప నెంచి క
శ్మలమగు గ్రామ్యధాటి కొడిసాచెడి తప్పను సైఁపు మమ్మరో!

ఉ. తప్పులఁ దోఁపనీకు, మెపఁదం గల శాస్త్రము గప్పిపుచ్చు, మే
చొప్పున నో దడాబిడిగఁ జొప్పశలాకలఁ బోలు పద్దెముల్
గుప్పఁగఁ జేయు, మెయ్యెడలఁ గొంకు ఘటింపకు, మెట్లొ నూఱులన్
జెప్పినదే మహాపదవి సేయుము, మూయుము గ్రామ్యవక్త్రికుల్.

ఉ. కష్టముగా నెటో భవదఖండకృపామహిమమ్మ కల్మి నీ
సృష్టి కవిత్వమధ్యమున ముద్దులు మూటలుగట్టఁజాలు ని
ర్దుష్టపుఁ బద్యమున్న నది తొల్లిరచించిన దండ్రి, వారి సం
తుష్టికి నటు కాదనుచుఁ దోఁపఁగఁ జేయుట యెట్లు శాంకరీ!

దాల్పఁదగునె। నీపరాక్రమమునకును నీయశముకు। నీదుబిరుదంబునకు లోఁ
నీవు మెచ్చ। వలయు నీజాతివార్ మెచ్చ వలయుఁగాక। యింక నెవ్వరు
మెత్తురో యీఁగలపులి!, యెన్నియో గొప్పకీటము లున్నవి సుమి। వాని కేమియు
గర్వంబు గానఁబడదు।, వెదక రవ్వంత యల్లి కల్లుదువో లేదో। మేలు నీదు
గర్వము పట్టఁజాలకుండెఁ।, జాలునింతటి నుంచైన సాలెపురుఁగ!।, బుద్ధి తెచ్చు
కొని నయాన బుజములెగర। వైచి కొనుటచాలించి గర్వంబు విడిచి। భద్రముగ
నుండుము మిదియు నీబ్రతుకు దెరువు.

పిప్పర సోదరకవులు

ఉ. గిరగిరఁ ద్రిప్పు మోఁగెడిఁ బకీరుకరమ్మున నొక్కయంత్రి, మా
'కిరకిర' బాలురన్ దమపఁ గీల్కొనుభంగియె మాన్యమైనచోఁ
బరపరలాడుచున్ గవితఁ బాడె దడాబిడిగా నటంచుఁ బా
మరులు నుతించుపూనికయు మాన్యతఁ గాంచుఁగదే మహేశ్వరీ!

మ. స్వరవర్జ్యత్వమెఱుంగకే పొరిఁబొరిన్ సంగీతముల్ వాడి యె
వ్వరు మెప్పింతురు! గాయకోత్తములు 'వహ్వా' నాఁగ; నట్లే పర
స్వరసందర్భము శ్రోత్రపేయతయు సౌశబ్ద్యంబు లే కెట్టులో
విరచింపన్ గవితల్ శ్రవోయుగళికిన్ విందుల్ ప్రసాదించునే!

చ. "పదనిస, సానిదానిపస, పస్పసరీసరి, గామగారిసా,
సదగద, నీరిసారి, దరిసా, గరిసా, నిరిసా, రిసా, రిసా,
గదగద, పాదపాద, సదగా, పదగా, నిదగా, దగా, దగా,"
యిది యొక గానమేని యిదియేనిఁ గవిత్వ మగున్ మహేశ్వరీ!

ఉ. "చేసిన దోసముల్ బయలుసేయఁగ నెంతువె! దుష్కవిత్వవి
న్యాసము బైటఁబెట్టుటకునై గమకించెదవేల" యంచు దే
వాసురయుద్ధముల్ గెలిచినట్టిఁడు పండితరాజుచేత నీ
వీసడిలంగఁజేసి మము నెందుకు దూర్చెద విందు శాంకరీ!

ఉ. ఎంచి పురాదులైన పదునెన్మిది వర్ణ్యములంగుఱించి వ
ర్ణించి కథానుగుణ్యముగ నించి రచించియె యుంచి రంచుఁ బ్ర
శ్నించినచోఁ సదుత్తరము చెప్పుటకున్ దగవైనయుక్తి దోఁ
పించి యనంతరమ్ము నడిపించుమి యాకృతి కో మహేశ్వకీ!

చ. కవివరులెల్ల మేలనఁగ గ్రంథములన్ రచియించి కప్రపుం
జవుల జగమ్ము ముంచెడి ప్రశంస ఘటించియు నేఁడు కొప్రపుం
గవులకతమ్మునన్ రసము గన్పడకుండెడి దిక్కుమాలు కా
కవితకు మమ్ముఁ బాలుపడఁగా నొనరించెద మాలదైవమా!

చ. గడియకు మూఁడువందలఁట! గంటకు డెబ్బదివందలంట! త
ప్పడుకవనమ్ము చెప్పుటకుఁ బూనినవారిని బట్టఁజేసి యె
ప్పుడు సరసాశుసత్కవనమున్ బచరించు మదీయవక్త్రమున్
"బడబడ" మోఁగు "తాషమరపా" నొనరించెదవమ్మ? యీశ్వరీ!

ఉ. వృత్తవిశేషముల్ చెడి వివేకము పాకముదప్పి సద్గుణా
యత్తతఁ దక్కి శయ్య యొకఁ డంతగ బొంతగ సంగ్రహించి యే
పొత్తును రోయకే పలుకు పోకడ నేరిపి మాదు కైత ను
న్మత్తతమైఁ జరించు కసుమాలగఁ జేసెదె మాలదైవమా !

చ. తొరతొర గ్రామ్యనామములు తొంబదియో పదియో సహస్రమో
పరపర గ్రుక్క త్రిప్పకయె వాగెడి విప్రవినోదివైఖరిన్
జరచర నోరు జార్చు టది సత్కవిధర్మము గాదటంచు నీ
వెఱిఁగియు దానికై మనము నేటికిఁ గొల్చెదవమ్మ శాంకరీ!

ఉ. అక్కట ! నీరసాశువున నందముఁ జందము లేక యెట్టులో
గ్రుక్కలు మ్రింగుచున్ వెడఁగుగొల్లల సుద్దుల నెంతపాడినన్
దక్కునె 'కైత' యన్ పదవి దానికి? "గాడిద గంపెఁడూఁక దాఁ
బొక్కిన నేమి లాభమగు" బొంకక తెల్పఁగదమ్మ శాంకరీ !

ఉ. అబ్బెస మేల సేయవలె నంబరొ ! తంబుర యొంటికంటి త
బ్బిబ్బ మృదంగ మీద్వయమె వేషముపట్టున లోటు గాని యా
బొబ్బిలిపాటగాండ్ర తలఁపుం గొలుపంగల పాడుకైతమున్
సిబ్బితి గల్గి పండితులచే నుతిగాంచెడి కోర్కె యున్నచోన్.

చ. కవితయుఁగాని సంతతియుఁగాని జనించిన యుత్తరక్షణం
బవిసి నశించెనేని ఫలమబ్బునె ? గర్భభరమ్ము దక్క నా
యువు లవమేని లేనిసుతు లొక్క సహస్రము ఱెప్పపాటులో
శివ ! శివ ! పుట్ట నేమియగుఁ జెప్పఁగదమ్మ, మదంబ! శాంకరీ !

ఉ. 'అనుకరణత్వమందు రస మారయరా'దని యప్ప సెప్పె, నో
యీశకుటుంబినీ ! జననమే లిఖియించిన బంతికిందనే
నాశముఁగూడ వ్రాయు టది నల్వకు సమ్మత మానుగాక, గ
ర్భాశయమే స్రవించుటకు నక్కట ! దీనికి భేదముందునే ?

ఉ. "మారుని నేరఁజాలు సుకుమారుఁడు, కన్నులు చేరెఁడేసి, బం
గారము మే" నటంచు స్మృతి గాంచిన బాలున కేద్భుభంగి వి
స్తారరసమ్ముగల్గుటయు సంభవ మందదుఁగాక, నిల్వఁగా
నేరని కాపరిపాశుకవి నేరుపు లేటికి మాకు, శాంకరీ !

చ. పలుకుల కల్కి నేర్చిన సుభాషితముల్ జతఁజేసి కచ్ఛపిన్
బలుకఁగఁ జేయ దానికి నుపశ్రుతిగా శ్రుతివిందుసేయుచున్
గలకలలాడు కంకణవికస్వరసుస్వర మట్టులుంపు నా
పలుకు లొనర్చెదే యనుపవాడిగ బండిరవంబు లీశ్వరీ!

చ. కలుషితమైన నీర్ దురుసుగాఁ బ్రవహించెడునట్లు తప్పుఁగై
తలు దొరలున్ దడాబిడిగఁ; బ్రజ్ఞుల కెట్లు రుచింపనౌ, శర
ల్లలితకలావిలాసవిమలమ్ములు సత్కమలంబులో, రస
జ్ఞులకు రుచించునట్టిది యగున్ హిత మాశుకవిత్వ మేరికిన్.

‡ (తలకుఁ దగని వ్రాఁతలు)

మ. కవితాతత్త్వరహస్యవేత్తృతకునై కష్టించునుత్కృష్టలి
ప్డవివేకుల్ కులగోత్రనిందకులు వేదాచారపారంపరీ
దవవహ్నుల్ సకలాన్నభోక్తలు సమస్తస్త్రీకుటుంబుల్ మహా
సువివేకుల్ విపరీత మీ తెలివి విజ్ఞుల్ రోయ కెట్లుందురో!

ఉ. దుర్మతముల్ కడుం బ్రబలి తొందర గొల్పెడుపట్ల ధర్మపున్
మర్మ మెఱుంగునార్యు లవి మాపినయట్లె కవిత్వతత్త్వవి
త్కర్మకు లాఁగఁగా వలెఁ గుకావ్యము; తాదృశధర్మ కార్యమే
కర్మ మెఱుంగఁజాలని యకర్మపరుల్ నిరసింప నేమగున్?

---

‡ (మే 10 వ తేది 1913 వ సం॥ కృష్ణాపత్రికనుండి)

# చరణాయుధ ప్రశంస

ఒక భాషాభిమాని

ఈ పోట్లాటకు అంతంలేకుండా ఉన్నది. ఈ కవులు కోళ్ళనుగూడా మించి పోయినారు. తురుష్కయుద్ధమైనా ముగిసేటట్లున్నది కాని యీ కవుల కలహ మెప్పు డారంభమైనదో దానికి విసుగు విశ్రామము లేకుండా ఉన్నది. అంత కంతకు కక్షలు ప్రబలుతున్నాయి. ఇరుపక్షములచుట్టు గ్రామసింహాలు చేరి గర్జనము మొదలు పెట్టినాయి. ఈ పోట్లాటల నాపించే ప్రభు వెవడు కనపడడు. వీటి విషయమై ఆంధ్రపత్రికలు జాబులు ప్రకటించకూడదని దొరతనము వారొక చట్టంచేస్తే బాగుండును కవులకే బుద్ధిలేనప్పుడు నావంటివా రేమి చేయగలరు?

ఉ. జన్నము లాఁగి పోయెనో! యశస్వుల సత్రము లాఁగిపోయెనో!
అన్నము మాల మాదిగల దండఱకుం బ్రియమై తనర్చెనో!
దున్నల కాలు భార్య లయి తోసము వందెనో! ప్రోషిత శిష్టసం
పన్నగృహస్థపుత్రికరపంకజ మంటెనో! వీరియార్పులన్.

ఉ. ఐనది కాదు, కాని దగునం, చది దేశము నుద్ధరించు నం
చేనరమాత్రిలో గిలుకు నేపపు వ్రాఁతల కూఁతమై యశో
ధీనులఁ బూర్వపండితగతి న్మతిఁ జొన్పెడి జ్ఞానులన్ మహో
ధీనిధులన్ వృథా దెగడు తెల్వ్యలవిల్వల నెంచ నేటికిన్?

---

(మే 15 వ తేదీ 1913 వ సం॥ సుదర్శనీ పత్రికనుండి)

# కవుల కలహములు

గతవారపు కృష్ణా పత్రికలో కవుల కలహములను గూర్చి విచిత్ర చిత్రావళిలో నొక చిత్రము ముద్రింపఁబడినది. అందు రెండుతలల కోళ్లు రెండు ముఖాముఖిగా నిలువఁబడి యుద్ధము చేయుచున్నటులను ఇరు ప్రక్కలను శునకములు అఱచుచున్నట్లును జిత్రింపఁ బడియున్నది. ఇది చూచుటకు మిగుల నచ్చెరువుగానే కన్పట్టుచున్నది. గాని కొంచెము దీర్ఘదృష్టితోఁ జూడఁగా మిక్కిలి జుగుప్సాకరముగఁ బర్యవసించు చున్నదని తెలుపుటకుఁ జింతిల్లుచున్నారము. ఈ జంటతలల కోళ్లరూపముతో నున్న కవులెవరో యెల్లరును జెప్పకయే తెలిసికొనఁగలరు...ఇంతకాలమునుండి వీరిట్లు వాదోపవాదములు చేసుకొనుచుండఁగా నింతవఱ కెవరి కేమి యనర్థము కలిగినదో చెప్పఁగలరా? వైదిక నియోగి కక్షలు పెరుగు చున్నవందురా? ఆపాప మిందుమూలముననే పండలేదు. అది యిదివఱకే పండి బ్రద్దలయినది... ఈ తారతమ్యచర్చ ప్రతివిషయములోనను గలుగుచుండును..."నిరంకుశాః కవయ" అనునట్లు వారిలో వారు చర్చచేసుకొనుచుండఁగా నడుమవారు వారిని గోళ్ళతోడను గుక్కలతోడను బోల్పఁజూచుట యనాలోచితము... కోళ్లు, కుక్కలు మొదలగు నీచోపమలచే వారిని బ్రజారంగమునఁ బడవేయుటకంటెఁ గొదమసింగములఁగానో మదగజములఁగానో ప్రదర్శించినచో సత్యమైన యర్థమయినను గౌరవమయిన ప్రదర్శనమయి యుండును... మఱియు వీరిట్లు నీచోపమలచేఁ జిత్రరూపమునఁ బ్రదర్శించుటయే కాక దాని వ్యాఖ్యానములో "ఈకవులకు బుద్ధిలేదు" ఇత్యాది పరమతృణీకారనీచ వాక్యములచేఁగూడ సంభావించిరి,

తే. గీ. జననమరణాలు లీస్టు విస్తరమొనర్ప
నవతరించిన యయ్యలే యగుదురొక్కొ!
పండితులటన్నఁ గవులన్నఁ బ్రాజ్ఞులన్నఁ
బత్రికలు వ్రాయువారింత లప్పగిదిగాక.

తే. గీ బుద్ధిలేదఁట? కవులకు; బుద్ధి గల్గు
వార లిఁక నెవ్వరో! కులాచారములకు
నున్న చుట్టైడి మేటిసంపన్ను లొక్కొ?
వీరలు నిగర్వులవ? గర్వు లేరు? జనని!

చ కవికలహాప్రచారములు కట్టిఁడులన్ గరఁగింప లేవు కో
ళ్లవుదురు వారికిన్ సుకవు; లన్యులు కొందఱు కుక్కలౌదు; రీ
యవినయమున్ సహింపనిగుణాఢ్యుల కీలిఖియించు ప్రాజ్ఞు లే
మవుదురొ? నీ నెఱుంగని రహస్యములుం గలవే? మహేశ్వరీ!

(1913 వ సం॥ రం॥ జూన్ నెల 15 వ తేదీ సుదర్శనీపత్రికనుండి)

ఇప్పుడు వివాద పడుచున్న కవియుగ్మములను గూర్చి కృష్ణాపత్రికలోఁ గోళ్లుగను గుక్కలుగను పరమనీచోపమగాఁ జిత్రించఁగా వర్తమానకవులలో గౌరవనీయులయి యున్నవారి నింత నీచపరచుట చాలజుగుప్సాకరముగ నున్నదని మేము వ్రాసినది పురస్కరించుకొని "కవులు కలహించ వలెనఁట" యను వ్యాసమొకటి సువర్ణలేఖ, యొక చదువరిపేరిటఁ బ్రకటించెను ... అంత కంటెను అధికులు చర్చించుకొనుచుందురేని వారి ప్రశంసయే యెత్తుకొనము. ఎందుచేత, వారి వివాదము తీర్చుటకు మనమెంత మన బ్రతుకెంత యనెడు స్వసామర్థ్య దౌర్బల్యమునుబట్టి మనత్రోవను మనము పోవుదుము. టర్కీ బాల్కను రాష్ట్రముల మహాప్రవిదారణము సంధిచేయ బ్రిటిషుప్రభుత్వము వంటివారికే యర్హత గలదుగాని, యలమంచిలి పొప్రియిటర్లు ఏమి చేయఁగలరు. ... ప్రస్తావనకవు లేతన్మాత్రులుగారు, కల మెట్లు చేతఁబట్టవలెనో తెలియని "చదువరి" ప్రభృత్యస్మాదృశు లందఱును వంకఁ దొరకెఁగదాయని యెద్దియేని యనిష్టకారణమున వారిని దోఁచినట్లెల్ల నీచపఱచుట కధికారము లేదు...చమత్కారముగా యుక్తిప్రయుక్తికముగా వాదములు చేయుచున్నారు సొంపుచెడినట్లు మధ్యస్థులకుఁ దోఁచుటలేదు ఇష్టములేనివారు వారి వాదములను బ్రకటించక

గీ. కోడిగుడ్డంత యన్నమ్మ గొసరె నొకఁడు
నిమ్మకాయంత గోరె సత్సమ్మతుండు
వేఱొకఁడు; దీనఁ గలసువివేక మజ్ఞు
లెఱుఁగ రది విజ్ఞులకేఁగాక యెట్లు తెలియు?

మ. ఉపమాకల్పనఁ బట్టి కాల్పనికసం దూహింపఁగా వచ్చు ని
క్కపుసౌభాగ్యము లెన్నియేని; యది యజ్ఞగ్రాహ్య మెట్లౌ? వృథా
కుపితుల్ తోఁచినయట్ల గిల్కుదురు సంకోచింప రల్లంత న
య్యపలాపంబు సదోవిగర్హితముగా నద్దెంతు రజ్ఞత్వముల్.

ఉ. అజ్ఞుల వ్రాఁతలే ప్రకటనార్హము లౌనఁట? త్యాజ్యముల్ మహా
విజ్ఞుల వ్రాఁత లౌనఁట! వివేకులు కొల్లఁట, తక్కులంట! ధ
ర్మజ్ఞత మేలుమే, లిదియు బ్రహ్మసమాజమతప్రపత్తి స
ర్వజ్ఞతయొక్కొ! యన్యమతవర్తుల కంబరొ! యింత జ్ఞానమే.

---

పోవచ్చును... వీరికి నిజముగాఁ గవులు కలహించి పాడయి పోవుచున్నారని పరితాపమా, లేక వారిలో నెవ్వరియందేని యనిష్టకారణమున నేదేని వంకఁబెట్టి యేవో వెలితి "రిమార్కు"లు చేసి తద్వారమున నయినఁ దమయనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమా?... తొలుత రామకృష్ణకవులు తమకీశ్వర వేరులన్న మాట వినగానే తిరుపతి వెంకటేశ్వరులు 'గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినందుకై' కంటగించుకొని కొంచెము ముష్టోష్టణము చేసిరి. ఇట్లె గుంటూరి శతావధానములోఁ గొప్పరపుకవి గారికిఁ దమ రంగస్థలములోఁ దమతో సముఁడన్న సిద్ధాంతముమీఁద సహాసనమీయఁగా నట్లు వలదనిరి. లోక సామాన్యమర్యాదకై మీరెట్టి యాసనమిచ్చినను మాయభ్యంతరము లేదు గాని, ప్రత్యేకించి మాతో సముఁడన్న సిద్ధాంతముపై యాసనమిచ్చిన మే మంగీకరించ మనిరి.

ఇందు దప్పేమియున్నది? సన్యసించి తపమాచరించుకొనువారికైనను నీవు కొలఁది వాఁడ వందుమేని యాతఁ డూరకోఁడే! అట్టియెడ మానుషము విడనాడని లౌకికకవిమాత్రులు స్వగౌరవన్యూనతాపరాభవము నెట్లు సహింపఁ గలరు.... కాఁబట్టి సర్వవిధములను ఏవంకనో తమ యనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమే యీ పరితాపమునకుఁ గారణమని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును... ఈ హృదయకల్మషముల కొక్క ప్రబలదృష్టాంత మిచ్చుచున్నాము.

సీ. అమ్మ యెంతటిధన్యురాలో యీబిడరజస్వలయయ్యు మొగియదిప్పటికిఁ బెండ్లి
కితనియోగ్యత నెన్న నెవనిశక్యము పెండ్లియాడె నల్వదియేండ్లయాఁడుఁ బడుచు
నాపెసంస్కరణపరాయణత్వము మిన్నయాఁ బుత్రవతి పెండ్లియాడె విధవ
ఆతఁ డిందఱకన్న నధికుఁ; డేమన జందెమును ద్రెంచె బాలుఁడైనను దెగించి

తే. గీ. ఇట్లు ధర్మేతరములనే యొప్పుడు వినుతి
సల్పు పత్రిక లెక్కడ! సహజధర్మ
బద్ధ బుద్ధికిఁ గాని కన్పడని సత్య
మనెడి పరమార్థ మెక్కడ! యఖిలజనని!

---

చిత్తగించుఁడు... నిన్నటి సువర్ణ లేఖలో... "ఓర్వలేక పగవులాడు కవులను జుట్టుజుట్టు ముడిపెట్టి ఇనుపగాలములు వేసి లాగుమన్నారండో! శ్రీరామరామ" యనునొక సందర్భములేని యపలాపమును వ్రాయించినారు... 'కవులను' ప్రత్యేకించి నిర్దేశమేల చేయవలెను? కవులనే కాని, యోర్వలేనిగుణము గల యితరుల నెవ్వరిని శిక్షింపరా యేమి?... లెడుబీటరు దొరగారు చెప్పినట్లు కామము తీర్చుకొనుటకు అకృత్య మెంత యుపయోగమో క్రోధము దీర్చుకొనుట కిదియు నంతియ యుపయోగము. ఈ యమపటవర్ణనము విధాయకమే గనుక ఓర్వలేక తగవులాడు కవుల నొక్కరినే కాక యాగణములోని వారి నందఱనుగూడ నాలోకమునఁ జిత్రవధ చేయుట తప్పనిసరి యని తెలియఁజేయుచున్నాము. కలహించఁగూడ దను వీరి సిద్ధాంతమే సర్వదా ఆచరణీయమను నేనియు, నట్టివారి నెల్ల నేకోళ్ళుగనో యేకుక్కలుగనో చిత్రించవలసియుండు నేనియు నిప్పటివఱకు ననేకవిషయములలోఁ గలహించుచు వచ్చిన కవులు, విమర్శకులు, పత్రికాధిపతులు, పండితులు, సంఘసంస్కారులు, పూర్వాచారపరాయణులు మున్నగు మహామహుల నందఱ నీవిధమునఁ గోళ్ళు, కుక్కలు, పిల్లులు, పందులు, గాడిదెలుగాఁ గూడ వరుసగాఁ జిత్రించి వారికి బుద్ధిగఱపుచుండవలెననియుఁ దెలియఁ జేయుచున్నాము. ముందు విఘ్నేశ్వరపూజగాఁ దొలినాఁటి కలహాకవులయిన దండి కాళిదాసులను జెఱియొక కుక్కగను వారికిఁ దగవుదీర్చిన దేవినొక యాఁడుపందిగను జిత్రించి యది మొదలు మొన్నటివఱకుఁ దగవులాడిన శిష్టుకృష్ణమూర్తి, పిండిప్రోలు లక్ష్మణకవి, వెంకటరత్నశర్మగారు, వీరేశలింగం పంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యగారు

సీ. ఘనుని బట్టుక నీచజనుఁ జేసి వ్రాసిన నది శిరమ్మునఁ దాల్చునట్టి ఘనులు
నీచుని నీచత నిక్కమ్ముగాఁ దెల్పువారి వ్రాఁతలు బట్టనైచు ఘనులు
సత్యమ్ము నెఱిఁగియు శాంతులపోల్కి నొప్పరకించు పరిపాటి నురుఁగు ఘనులు
ఏదియో పోట్లాట నూఁదినఁ బత్రిక కబ్బ 'వేట' రటంచు నరయు ఘనులు

తే. గీ. పత్రికాధిపతిత్వంబుఁ బడసిరేని
దానివలనను గల్గెడిహాని జగతి
కెంత యని చెప్పఁగలము లోకైకజనని!
సత్య మడుగంటు నెగడు నసత్యమెందు.

## కథాప్రారంభము

వ॥ అంబా! దీనికేమి, ప్రకృతవృత్తాంత మ్మవధరింపుము.

(సూర్యోదయము)

మ. పరితస్సర్పదపారభాస్వరగవీపారంపరీనున్నతై
మిరభారుండు దివాకరుండు త్రిజగన్మిత్రుండు మందేహధి
క్కారణోద్యోగి వెలింగె నార్యులు "కృతఘ్నఘ్నాయ దేవాయ" యం
చెరఁగన్ దస్కరకోటి కాల్కాలఁది నెందేఁ బందలై పాఱఁగన్.

చ. సరసిరుహాప్తుపాదములు సారెకు నుప్పరమందు నెందుఁ గొ
ప్పరపు శిరమ్ములందు నొగిఁ బ్రాఁకి ఘనాలయపంక్తి మీఁదుగా
ధరణికి డిగ్గి యెల్లెడలఁ దామయి యామెయి వారి శైత్యపున్
భర మఱఁజేయుచున్ నెగడెఁ బండితపామరరంజకమ్ములై.

(కొప్పరపువారు కాలుదువ్వుట)

చ. దురుసుగ నుండె నుత్తరపుధోరణి యుత్తరుగత్తరంబలెన్
ద్వరపడి తిట్టి బందుగులదాపునఁ దూఱుట స్పష్ట మయ్యె నె

వడ్డాది సుబ్బారాయఁడుగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మున్నగువారి వంటిఉను వారివారి యర్హతకుఁ దగిన జంతువులతోఁ బోల్చి చిత్రింతురుగాక అపూర్వోపనిషన్మతము వెలయింత్రుగాక.

త్తఱి నెటఁ జేయనట్టి * యవధానము నెత్తుట వీర్వలాయన
స్థితు లని యెంతమూర్ఖునకుఁ జెప్పక చెప్పఁ దొడంగె నంబికా!

క. అలనూజివీటి శిష్రికా, కళమున మఱికొన్నిచోట్లఁ గోవిదు లెఱుఁగన్
జలిపిన ప్రత్యేకపుసభ, లలవా లెఱుఁగమియు స్పష్టమై కన్పట్టెన్.

‡క. ససహాయంబుగ నవధా, నసభన్ బొనరించునట్టి నరుఁడె ఘనుఁడో తా
నసహాయుఁడు ఘనుఁడో యది, సుసుమలకుం దెలియునే ఘనులకుం దక్కన్.

◆క. తెలుఁగట! మీసంబఁట! అది, నిలుపన్ వలెనంట! వీరు నేరుతురొక్కో
తెలుఁ, గౌరా! తెలుఁగనఁగాఁ, దెలగాల్ మాటాడు పచ్చి తెలుఁగేయగునో!

తే. గీ. బళిర! యీవ్రాఁత తెలుఁగెల్లఁ "బాటిమీఁది
పందికొక్కులు బల" మన్న పగిదిదోఁచె
వీరికి జవా బొసంగుట విజ్ఞులొప్ప
రయిన సామాన్యలోకు లట్లనరుగాక.

క. అని యెంచి వారు పద్దెము, లను గిలుకన్ మేము వానిలక్షణమును నే
రనిపోల్కి †వచనమున జా, బును బంపితిమంబ! వారుపురపురఁబోకన్.

---

* బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులకు......

సీ॥ అష్టావధానంబు నాచరించెదరేని యద్దానిమించి సేయంగలేమె
శతఘంటకవనంబు సల్పఁబూనెదరేని యద్దానిమించిసేయంగలేమె...

‡ గీ॥ అన్యునిసహాయ మించుకయైనలేక, పద్యమవధానమందు జెప్పంగ లేని, మీ మహాధారణాశక్తి......

◆......తెలుఁగు మీసంబు నిలుపంగ దిప్పుడింక. (20-8-11)

† మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బారాయ కవిగారికి. అయ్యా! పద్యమయంబగు తమ యుత్తరమందినది, "మీపరువును మాపుమాటను జవాబు నొసంగినవాఁడ నమ్మఁడీ'' అని వ్రాయించినారు. ఏసందర్భమునం దేవిషయమునం దేరూపముగా మాయేమాట మీయేపరువును మాపినదో యావిషయము విపులముగా వ్రాయించినంగాని మీకుఁదగిన యుత్తరమిచ్చుటకు వీలులేదు. కావున వెంటనే దయచేసి పైవిషయమును వ్రాయింతురుగాక.—

21—8—11.

ఇట్లు, దివాకర్ల తిరుపతిశాస్త్రి.

క. 'పద్దెములు వ్రాసితిమి వి, ద్వద్దశ గూపెట్ట మనము పలుచనగా వా
ర్గద్దె మిటు గొట్టి'రని లో, గుర్దుకొనం దొడఁగి రంట? కొప్రప్రసాముల్

క. 'మును రామకృష్ణులకుఁ జ, క్కనిపద్దెమ్ములను వ్రాసి ఘనతనొసఁగి రి
య్యానువున మనలం జూచిరి,'యని లోలో నగచిరంట? యాత్రింపుఁగవుల్

క. అనుకొంటిరి మేము వీరికి, ననపద్యపుఫక్కి వచనమైనన్ వ్రాయం
జనద, యది గ్రామ్యశైలిం, బనుపడుటే యుక్తమనుచుఁ బవపడి జననీ.

క. కాని యటు మొదట యోజన, మానసమునఁ దవులకున్కి మఱి యాధాటిన్
బూని లిఖియింప మైతిమి, దానికె యక్కవుల కెపఁప తబ్బిబ్బయ్యెన్.

క. తగినంతగూఢగతి మే, మగుపఱచిన వీరికర్థ మగుపెట్టులు
యఁగ నర్థము తముఁగోరఁగ, నగరాజకుమారి ! నగరా? విజ్ఞుల్.

సీ. ఆవి యనడ్వాహమ్ముల న, "మాకునిత్యమియ్యావియె కూర"కటన్న దెవరుజననిః?
ఒక్కరో? యిర్వురొక్కొ? దేవులనుకేలి 'కెద్దు'లంచనుకొన్న దెవరు జననిః?
"లవణం"బనిన నేదొ యవలికిఁ జని తెచ్చి యెలమి నడ్డించిన దెవరు జనని ?
సభ "నఘాతో బ్రహ్మ"చదువ "సీతాత" లోనవుప్రసంగము నేసి రెవరుజననిః?

గీ. వారిలో వారు గారొ కొ్రంపువారు
కాక యుండిన గీత మెక్కితిన కృత్తి
మయ్యె వీరికి? నీలాటి యభముశుభము
నెఱుఁగని యమాయకులు మీసలెత్తనేల.

క. ఇది యిట్టు లుండె మాజా, బది వారికిఁ జేరె మరల నలవ్రాఁజాబున్
గుదురుచుకొను నీలోపలఁ, బొదలిన వేఱొకవిశేషమున్ విను మంబా.

(మ॥ రా॥ రా॥ ఏకా రామయ్యాపంతులుగారింట విందు)

ఉ. ఇంతకునున్నె విందనుచు నెల్లబుధుల్ విన రామయార్యుఁ డే
నంతపమూనియో పిలిచెఁ జట్టన, నాఁడె నియోగివైదిక
స్వాంతము లెజ్జఁబొల్చెఁ గొనసాగని యాసనచర్చకన్, ధీ
మంతుఁ డితండు మున్ననినమాటకు దాఁటక వచ్చి చెచ్చెరన్.

ఉ. నేఁ డరుదెంతుమన్ననుడి నిక్కమొనర్పఁ డటంచుఁ బిల్చి మో
మోడిన తోఁవ గన్పడఁగ నొయ్యన నయ్యనఘుండు వోయెఁ "బో,
గూడదు కూడు" నంచు నొకకొందఱు దందడిఁ జర్చఁజేసి రా
పాడి గడింప 'కేగుటయె బా' గనె వెంకన నిర్విశంకుఁడై.

ఉ. ఇందనుకూలమై జరిగె విందున లోప మొకింత లేద, యెం
దెందులలేని మంచి దని యెంచిరొ యేమొ, మఱొక్కపంక్తి నా
కుం, దమవారి కంపఱకుఁ గొండొకపంక్తియుఁ గాఁగ నేరుపా
టుం దగఁ జేసి రయ్యది కదా సుఖ మిచ్చె ననేకభంగులన్.

ఉ. పట్టురుమాల్ బుజమ్ముపయి వ్రాలఁగ విప్రప్రభ లీనఁ బంక్తికిన్
రాట్టయి యగ్రపీఠమున రాజిలెఁ గొప్పిప్రసుబ్బరావు, బల్
దట్టులు మందపాటికులధన్యుఁడు లోనగువార లాతనిం
బట్టి క్రమమ్ముగా నతనిపంక్తి నెసంగి రభంగురస్థితిన్

తే. గీ. జరిగె నారీతి విందు ప్రశస్తగరిమ
భోజనానంతరమ్మున నోజఁ గొంద
ఱేగుదెంచిరి వారు కోటీశశర్మ
శాస్త్రిముఖ్యులు పదపటిచర్య వినుము.

మ. చిఱుమామిళ్ళకులుండు యోగ్యుఁ డలలక్ష్మీప్రపూర్వనారాయణుం
డురుకీర్తిస్థిరుండు వచ్చెనట కుప్యోగిత్వమైత్రిన్, ధురం
ధరులై తక్కినచుట్టులన్ మఱియు నం డెక్కుంగటా రొప్ప భా
స్వర మయ్యెన్ దగుపాటిగ సభ భవిష్యచ్చర్య సూచించుచున్

శా. ఏకారామయగారితమ్ములంట! బీ,యే,బీ,యలై క్లీడరీ
దాఁకన్ వచ్చినవేఁటియంట! మఱి యా ధన్యుండు తాంబూలముల్
వీఁకన్ గొన్ని ఫలమ్ములుం గొని సభన్ వీక్షించి తాఁ బంచె; నా
పోకల్ కొండొక వర్ణనీయము లనంబోలుంజుమీ శాంకరీ!

ఉ. ముందు భుజంగరాయనృపమూర్తికొ, కొప్పిప్రటయ్యకో, ఫలం
బందఁగఁజేసి యాపిదప నస్యలు బంధుల కిచ్చి మీఁద న
స్పందితకీర్తి కంఘ్రిజనిభాస్వరుఁ డౌ నలమేటి కీయ నా
విం దతఁ డందకే కదు వివేకి మమున్ గరసంజ్ఞఁ జూపుచున్.

ఉ. రామయగారితమ్ముఁ డలరారెడియోగ్యతఁ బొల్చువాఁడు సు
శ్రీమహితుండు లక్ష్మినరసింహ సమాఖ్యుఁడు మా కొసంగెఁ ద
ద్ధీమహితత్వమేమి, మఱి తేఁకుపయేమి మది న్నుతించుచున్
ప్రేమ ఫలమ్ము వెంకన పరిగ్రహణం బొనరించెఁ గ్రన్ననన్.

చ. తిరుపతి పుచ్చుకోక యొకతేఁకువ దాని ననాదరించఁగాఁ
గరము మదిన్ దలంచి యటు కర్జమునన్ గుశలత్వమూనె, సం
తరమునఁ దత్ప్రదాత యది తా గ్రహియించె నొకింత చర్చయున్
సరసముగా నెసంగె నది సభ్యు లెఱింగినదే మహేశ్వరీ!

ఉ. రామయగారికిన్ మఱియు రామయతమ్ముఁడుగారికిన్ గడున్
ధీమహితత్వమందునను దేఁకువయందును గల్గువారకున్
మామదిఁ జర్చ నల్పుచుఁ గ్రమమ్ముగ వచ్చినతోవ నింటి కే
మేమియొ చెప్పికొంచుఁ దగ నేగితి మానిసి వోయె సీగతిన్.

చ వెలవెలవోయెఁ జుక్కలు వివేకవిహీనులమోములట్ల ని
ర్మలసలిలాశయంబులు ప్రమాద మెఱుంగని వారి మానసం
బులబలెఁ దెల్వి మీఱె ఘనపుణ్యులు వైదికులు న్నియోగులున్
గలిసి యొసంగునర్ఘ్యములు గైకొనుచుండె దివాకరుం డొగిన్.

మ. అది వర్షర్తువుగాన మేఘపటలం బావంత దన్గప్పఁ గో
విదమాన్యుండు దివాకరుండు తనగోవిస్ఫూర్తిచే జ్ఞానిదు
ర్మదముంబోలె నపాకరించి సుదినప్రఖ్యాతి యవ్వేళకున్
గదియన్ వెల్గఁదొడంగెఁ గాకవితతుల్ గ్రాసార్థ మఱ్ఱాడఁగన్.

క. తరువాతఁ దనదు సొమ్మగు, "గురుతరలీల" యనుపదముగొని పద్యంబున్
బురపుర లిఖించి మీసము, స్మరియించుచుఁ గొప్పరంపుచతురుఁడు పెలుచన్.

ఉ. * పత్రిక నంపి యప్పుడును బద్యము వ్రాయక యుత్తరించు మా
పత్రికఁ జూచి "వీర్మనకుఁ బద్దెము వ్రాయమిఁ జూడ,' నేటి కీ
యాత్రము మీరు మాకుఁ గవులే యని తోఁపదు మీరు తిట్టినన్
శత్రుత మాకుఁ బుట్ట'దను చందముగా" మదిలోఁ దలంచుచున్.

---

* మహారాజశ్రీ తిరుపతివేంకటకవులకు......చ॥ గురుతరలీలచెప్పె సభ కూర్పఁగ నుంటిమిగాని, భానువా। సరమున చక్కరారెవరు...ఆశుకవిత్వశతావధానముల్। విరచనసేయరాఁడలయు, నెంటనె, మేమవి యాచరించి ధీ। వరసభ మీప్రతిజ్ఞ దెలుపం గలమీసము దీయఁజేతుము..."

గుంటూరు,
22-8-11.

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బారాయశర్మ, శతావధాని.

క. పదపడి*పచనమె వ్రాయుచుఁ, దుదిదమకం బత్రికలకుఁ దొడఁగెన్ 'సుకవుల్
పదుగురుగల సభ'యన న, ప్పెదలో రాయిపడి వ్రాఁత లెల్లన్ సురిఁగెన్

క. ♦తటిమితటిమి మునుమా కు, త్తరములు లిఖియింపు నతని తత్తఱమూపై
విఱిగి సురిఁగి కరిగెనో? యు, త్తరమే వచ్చుటకు మిగులఁదడవై పోయెన్.

---

గుంటూరు, 23—8—11.

* మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి. అయ్యా... మీసభఁ బద్యమున కర్థ మేకారణముననో మీకుఁ దెలియలేదనుకొనియెదను... తెలియదేని పెద్దలనడుగుఁడు... (4) ఈప్రతిజ్ఞ ప్రస్తుతవిషయము కాకపోయినను మీయంతటఁ మీరు పురస్కరించుకొని వివాదకుం దిగుటచే నయ్యది యింతటినుండి మీయెడలఁగూడ నిర్వహించుట కంగీకరింపక తప్పినదికాదు... (9) మీరు మాకుఁ దెలిసిన యంశములలో నేకదేశప్రవిష్టులు మాత్రమే యయినను మీకోరికంబట్టి మీసభకు రా నుద్యోగింతుమే యనుకొనుఁడు రేపిఁక నొక రాంధ్రభాషైక దేశమగు గ్రామ్యభాషయందుఁగాని నిర్యతిగణప్రాసశాబ్దరసాభాస కవిమార్గమునంగాని యన్యత్రఁగాని మమ్ము జయింపుఁడని కాలుద్రవ్వినచో మాగ్రహాచారమందుకు నోడఁబడవలసినదేనా! అందులకుఁ బ్రాజ్ఞులు సమ్మతింపవలసినదేనా! మాకుఁగల శక్తులలో నేకైక దేశమున నంతో యింతో యెంతో యెఱిఁగినవారెల్ల మమ్మెదిరింపఁ దగువారేనా! శాంతం పాపం... (12) ఈ వ్రాఁతవలనఁ దెలుఁగునేని మీకు వదలితిమని యనుకొనకుఁడు..."

గుంటూరు, 27-8-11.

♦మ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయ శర్మగారికి, అయ్యా, (1) జరూరు "అని 25 వ తేదిని మేము వ్రాసిన యుత్తరమునకు 27 వ తేదీ 11 గంటలకు మీ రిచ్చిన జవాబు అందినది...౧. సభ ముందు మీరే చేయవలెను. ముం దుత్తరము వ్రాసి యవధానాశుకవిత్వములకై కాలుద్రవ్వినవారు మీరుకాని మేము కాము...౨. మా విషయమై మీరును మీ విషయమై మేమును నవధానపు టేర్పాటులు చేసికోవలసినదేకాని యయ్యవి సభ్యు లేర్పఱుపఁదగినవి కావు. ఉభయులచే నేర్పఱచికొనఁబడిన సభ్యులు న్యాయాన్యాయములును రసారసములును దారతమ్యములును విచారింపఁదగినవారు మాత్రమే. ౩. ఈ విషయముల కంగీకరించుచు మీరు సభ సమకూర్పుఁడు, లేదా మేము సమకూర్చె

క. లక్ష్మీ "బాజాసందడి మం, గళ నూత్రము మఱచినట్టు"గా సభకై ముక్
గిలికిన రవివాసర మా, నలికిఁ జని వచ్చె సోమవాసర మంతన్.

చ. సభయగునన్న యాదినము సందడిగా జను లేగుదేర రా
నభమయి పోయె నెన్నెడల సందుల గొందుల సంటపూటియిం
డ్ల భరముగా జనుల్ విడిసి "డాబులు డాబిరి యేలసేయరో
సభ" యని కొంపరిపుంగవుల సారెకుఁ గేరఁ దొడంగి రంబికా!

సీ. పుట్టుదిట్టయు లేదుపో? నిల్చు టెట్లు కొప్పరమంచుఁ బలుమాఱు పలుకువారు
తన్నుఁగట్టలబట్టి తనయున్నతిని నిల్పు నెంతదనన్నటంచు నెంచువారు
తన్నానుబండలే తన్ను పంచననేయ నవసరంబైనప్పు డనెడువారు
నేల విడిచి సాము లేలాకో? యొకచోట నంకెలోనే యుండక యనెడివారు

తే. గీ. వింధ్యగర్వం బగస్త్యునవంధ్యమహిమ
మడఁగించి యిసీ! యని యొఱలువారు
హంసకాకచరిత్రి మిష్టందఱకును
స్మృతికిఁ దగిలె నటంచు వచించువారు.

---

దము...రా. జరూరని వ్రాసినను వెనుకటివలెనే ఆలస్యముచేయక రేపు సూర్యో
దయమునకుఁ దప్పక జవాబు పంపవలెను.

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

——

ఉదయం 8 గంటలకు 28-8-11, గుంటూరు.

అయ్యా! ఈ దినమున సభ తప్పక జరుగునను మీ ప్రకటనను బురస్కరిం
చుకొని యనేకు లనేక గ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు. వారిని
వృథాశుల నొనరించుట యుచితముకాదు కావున నవధాన సభాపిషయ మేమయిన
దియుఁ బ్రకటించి వారి సందియము దీర్పవలెను. మా యుత్తరమునకుఁ బ్రత్యుత్త
రము రాకుండగనే మేము ప్రకటించుట యుక్తము కాదుగదా?

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

మ. ఒకచో శైలిగ నొక్కచో నడిగ నోహో! యంచుఁ గన్యాగ్రణీ
పరికరం బెంచఁగ నంచ యేగె, నటు "రార"మ్మన్న కాకంబు ము
న్నొకతీ, రాపయి నొక్కతీరు, పయి నెన్నో తీరులై డస్సి, నూ
టొకయానమ్ములు          శరణం బొందెన్ మరాళప్రభు

క. అని పూర్వగాథ లెన్నుచు, మనమునఁ బమపడిన శ్రీమకు మతిమతి విసువుం
గనుమఁ దిరిగిపోనెంచుచుఁ, బునఃపునర్యోజనలకు బుద్ధి చొనుపుచుఁదాన్.

ఆ. వె. కొండపీటిసామి దండ నుండెడి లేడి
కొండయేనికూఁతు గుజ్జునకుఁ
దఱుచు భయము చెంది దండెంబు లిడుచో య
ద్దానితోడఁ జెనఁగు తలఁపు గొనునొ!

తే. గీ. సింహగమనంబు నేర్వంగఁ జిన్నిలేడి
కెన్ని జన్మము లెత్తిన యేని గలదె!
పాల్యపాలకభావసంబంధ మునుపఁ
దలఁచు టది యెంతయేనియుఁ దప్పిదంబు.

క. తనపాదములు మనమ్మున, ననయము మననమ్ము నిల్పునస్పటికకుఁ దాఁ
గనికరము కరపు గని దా, నిని ముద్దుగఁ జూపకున్న నేరము హరిదే.

క. హరికిన్ హరిణమునకు సం, గర మది హాస్యాస్పదంబు గాదనువా రుం
డరు దానికేమి హరిణము, కరి నెదురుబె యంప మెట్లు ఘటియించునటుల్.

ఉ. రంహువు శీఘ్రగామియని రాజులు పట్టపుటేన్గు వీడి గా
జ్యాంకము గాఁగఁ గైకొనిరె యక్కట! యేనుఁగుతోడఁ బోర నా
జింకకు శక్తియున్నదె? ప్రసిద్ధికినై "యెదిరింపు" మంచు నే
కొంకును లేనివాఁడు పురికొల్పినమాత్రిన యేమిలాభమో!

చ. అరులకభేద్యమైన చతురంగబలమ్ములు గల్గునేనితో
గాతియలగొల్లలఁ జెదురుకోలు ఘటింపఁగ నెంచి "మీరలున్
గాతియలతో నెరం"డనుచుఁ గోరిన "సీ"యని రోసి, దానికే
"సరి"యని సిద్ధపడ్డ వెడజాబుపరాబుల డాబు లేటికో.

ఉ. ఇచ్చి వరమ్ముఁ గైకొనరె యెల్లసురారులకున్ నిలింపు; లా
పచ్చరితుల్ మహాత్ములు లసన్మదహారులతోఁ బ్రినఁ బట్టి వా

రిచ్చినమెచ్చు లాగికొనుటేమి యపూర్వము! మెచ్చినంత నే
హెచ్చును దగ్గనుఁ బలవదే? తలదాఁటినపోక లొప్పునే.

శా. దేవబ్రాహ్మణవృత్తులన్ విడిచి వర్తింప న్నియోగించి భూ
దేవుల్ వీడుదు రాలపోతు నది భూదేవాజ్ఞకుం దక్కు దు
ర్భావం బౌతతి నూరకుండరుగదా, పైవచ్చుచో నెవ్వరిం
గావంజూతురొ? కావలం బడఁపరే? కాల్ద్రిప్పఁగా నిత్తురే.

ఉ. చెక్కిలినొక్కుచున్ జనులు చేఁపఁగ ముద్దిడుకొంచుఁ బేర్మిమై
నక్కునఁ జేర్చికొన్న సమయమ్మున బాలుఁడు పాలు గ్రోలుచున్
ముక్కు 'కటుక్కునన్' గొఱుక ముద్దిదియెల్లను మూలఁబట్టి "నా
యక్క! ఇదేమిరోరి చెడుగా" యనదోసమె? గాన రోసమే.

చ. వితతతరప్రబంధముల విశ్వజనీనములన్ రచించి కీ
రితి జగమెల్ల నించుచుఁ జరించెడి తిర్పతివెంకటేశ్వరుల్
మతిచెడి కొప్రపుంగవుల మాయకవిత్వముతోడఁ బోరికిన్
గుతుకము పూనినా రని జనుల్ విని నవ్వుదు రేమొగమ్మునన్.

ఉ. అల్లిక లేమి సాలెపురుగల్లదె? 'హు' ప్పని యూఁదునంతలోఁ
బొల్లగునల్లికల్ సరిగ బుద్బుదముల్ గద! దీని కేసుదృ
క్తల్లజచిత్రమేరియు యథార్థముగా ముదమందునే? యెటో
యల్లిన దేల కాదనఁగ నం 'చదిమే' లను టొక్క వెఱ్ఱికో.

ఉ. మంగలివాని యుద్ధము క్రమమ్మున మున్ను రచించినట్టివే
ముంగలి కీడ్చి పాత్రమును బొల్పుగ నవ్వఁగఁ జెప్పఁ శిష్యపో
ల్కిం గడు ధాటిగాఁ జదివి వేవల మెక్కుడొ యొక్క టొక్క టో
జం గయితంబు సెప్పుట యశస్కరమే, సుకవీంద్ర సత్యమే?

ఉ. విప్రవినోదిసంచి నెటు వేఱొక వస్తువు లుండు నట్టులే
కొప్రపువారు సంచి నిడుకొందురు వర్ణన లన్ని చేసి, యా
శు ప్రకృతిన్ రచించిరని శుద్ధులమాయికు లంచు మర్మమున్
సుప్రథితుల్ గ్రహించితు రిది చూచిరి పట్టి రనేకు లెల్లెడన్.

ఉ. గుట్టిది బైటఁబెట్టుటకుఁ గొందఱెఱింగియు సంశయింతు రీ
చెట్టి నడంపకున్న నెటు చేటు దొలంగు? మహాకవిత్వ వి

ధట్ట సుధాసధామకవితానవతామరసాననావచః
పట్టణవైభవప్రథిత బంధురసౌధవిలాసలక్ష్మికిన్.

ఉ. జీవనమాడె మాకని వచింతురుగా కొకకొంద ఱట్టివా
రేవగనైన జీవనము నీవయిఁ జేతురుగాక, కైత యే
కావలెనే? మఱొక్కగతి గానఁగరాదె? యమాయికాత్మలన్
జీవికకై జగం బపహసించునటుల్ గికురింపఁ జెల్లునే.

చ. ఇటులొక కొంతమంది కడు నెల్లిదపుంగతి దోఁపనాడ న
ప్పటుమతు లాడుపల్కు లలపక్షమువారు సహింప "కేల యీ
కటువులు? కొప్పరిపుంగవు లఖండులు వారల శక్తి చూడుఁ, డు
త్కటమసె, గోరతం బనెడికావ్యమునం దగుపట్టు" నావుడున్.

ఉ. అప్పరమేశ్వరీ దయకు నాకరులన్ గదలించి దానిచే
గొప్పను గోరి కర్తమునఁ గూలి యెటో పయి రాఁగడంగి యీ
కప్పలరావముల్ కొఱయుఁ గావని లోనఁ దపించి పొక్కు నీ
కొప్పరపుంగవీశులకు గోరతమే హితమెన్ని భంగులన్

చ. అనుటయు వారిపక్షపు జనావళి వారలయోడు పూర్తిగా
మనమునఁ బట్టియుంట మఱుమాట వచింపక యూరకుండ వ
చ్చిన జనసంఘమందలి ప్రసిద్ధులు కొందఱు కొప్పరంపువా
రిని గని కొన్ని మాటలను రేఁగగ నేగెవ మంచు నెంచుచున్

క. చనుచుండ వారిపక్షు, మ్మనవా రొకకొంద ఱాఁగి మొగి నేమేమో
యన మొదలిడ 'మీరెవ్వరు? చనుఁడా, మేమడుగ నటకుఁ జనవల'ెనుచున్.

శా. కాలిందప్రిష్వితి రూరకుండెదరె? సంస్కారుల్ జగమ్మందు నే
వేలున్నా రలవారిఁ గోరికొనుఁ డావిద్వాంసు లేతెంచి మీ
మీలోపమ్ముల నేర్పరించెదరు సామ్యమ్మేరి కెవ్వారికిన్
వీలౌ తెల్పెద రీనుడిన్ వినఁగ నువ్విళ్లూరెడిన్ లోకముల్.

క. తిరుపతి యెట్టిదియో? కొ, ప్పర మెట్టిదియో కవిత్వభర మెట్టిదొ? సం
స్కారణం బెట్టిదియో? ధి, క్కారణం బెట్టిదియొ? తెల్పఁ గలరవ్వారల్.

చ. పరు వెటువంటిదో? తెలుచు బాసయు నెట్టిదొ? లేశమేని సం
స్కారణము పూజ్య మయ్యు సరిగంగలనాడుట యెట్టిదో? సమ

స్కారమున నాసనమ్ము నెడఁ బోరెడిధీరత లెట్టివొక్కొ ? వి
స్తారము లౌసంగ లెట్టివరొ? సత్కవితావనితావినోదముల్.

ఉ. కోరిక లెట్టివో ? యటఁ గొంకదయింకమి యెట్టిదో ? పరి
ష్కారము లెట్టివొక్కొ ? మమకారము లెట్టివొ ? యంతఁబోక ధి
క్కారము లెట్టివో ? పయివికారము లెట్టివొ ? బారుబూరలం
కారము లెట్టివొక్కొ ? యధికారమదెట్టిదొ ? కారమెట్టిదో.

ఉ. సారము లెట్టివో ? పయి నసారము లెట్టివొ ? కాలుద్రవ్వు ఝం
కారము లెట్టివో ? పయిఁ జకారము లెట్టివొ ? యంతలో దభ
త్కారము లెట్టివో ? మఱి నికారము లెట్టివొ ? పిమ్మటం దిర
స్కారము లెట్టివో ? పొరిఁ జోకారము లెట్టివొ ? కాఱు లెట్టివో?

ఉ. శీరము లెట్టివో ? తిరుగు బేరము లెట్టివొ ? పిమ్మటన్నమ
స్కారము లెట్టివో ? పయిప్రకారము లెట్టివొ ? యాపయిన్ వష
ట్కారము లెట్టివో ? పయి నకారము లెట్టివొ ? మీదు మీదు నా
కారము లెట్టివొక్కొ ? నడికారము లెట్టివొ ? వైరమెట్టిదో?

ఉ. హారము లెట్టివొక్కొ ? వ్యవహారము లెట్టివియొక్కొ ? యీచమ
త్కారము లెట్టివొక్కొ ? బయికారము లెట్టివియొక్కొ ? పైబహి
ష్కారము లెట్టివొక్కొ ? యుపకారము లెట్టివియొక్కొ ? యాయహం
కారము లెట్టివొక్కొ ? యపకారము లెట్టివొ నేర మెట్టిదో?

ఉ. పారము లెట్టివొక్కొ ? పయివారలశూరత లెట్టివొక్కొ ? స్వీ
కారము లెట్టివొక్కొ ? గుణకారము లెట్టివొ ? చుట్టునున్న ప్రా
కారము లెట్టివో ? పయి లకారము లెట్టివొ ? చాటు చాటు స
త్కారము లెట్టివో ? తెలుపఁగాఁ గలవారలు పండితుల్ గదా.

చ. కవి యన నెట్టివాఁడో? కవిత గా దనునట్టిది యెట్టిదో? వృథా
కరణము లెట్టివో? కవుల రాజము లెట్టివొ? సత్కవీశ్వరో
త్సవచరితమ్ము లెట్టివొ? బుధత్వ మదెట్టిదొ? యేరి కేరికిన్
శివ! శివ! సామ్య మెట్టిదియొ? చెప్పఁగలారు బుధోత్తముల్ గదా.

చ. ఎవరును నేరు నొక్కయెడ నెల్లరు మెచ్చఁగఁ గూరుచున్న నో
ప్పవునొకొ! యేరికిం దగదొ? యక్కట! శక్తులు పట్టి చూచి "వి

ర్కావు, లలవారలో, కవులు గాఁ దగువార" లటంచుఁ దెల్పఁగా
నెవరితరంబు? పండితకవీంద్రులు దక్క జగత్త్రయమ్మునన్.

ఉ. రా మనిరోక్కా! పండితులు, రమ్మని కోరనెలేదో? సద్యశః
కాములు మీరు వారిపయిఁ గాలటు ద్రివ్వి యుపేక్షసేయఁగా
నేమి! వృథాగ లోకమున కింత పరిశ్రమ మేల పెట్టినా?
కీమెయి నూరకుంట తగునే! యని కంకెద మంచుఁ బోవుచో

ఉ. ఏమిది! యీ జనంబునకు నింతటి పక్షము వారియందుఁ ద
న్నామము వీరి కింతగ మనమ్మున కెక్కఁగ నేల! క్రొపు
న్నామము కోపపాత్రముగ నాటగ నేల! స్వదేశవాసు లన్
ప్రేమముగూడఁ గన్పడ దరిప్రకరమ్మును మించి రీ ప్రజల్.

చ. అని మనమందు నెంచుకొని యవ్వలి పక్షపువారు "మీరు వ
చ్చిన పని చూచిపోవుటకుఁ, జెప్పెడిమాటలు పెద్దమాట, లే
ర్ఘను లయి మీకుఁ గట్టములు గప్పెద? రింతటి కంఠశోషకుం
బని గనుపట్టు" దంచు నుడువన్; "బని లేనివె వచ్చినారమే.

మ. కవితావాద మటన్నఁ జూచుటకునై కష్టించి యీసత్సభా
సువిశేషంబుల నాలకించుటకు నచ్చోనుండి యిచ్చోటికిన్
జవసత్త్వమ్ములు వెచ్చఁబెట్టుకొని రాఁ జన్నే! వృథాహంకృతి
స్థవిరుల్ నించిన పత్రికల్ గని యథార్థం బంచు నూహించుచున్.

మ. అదిగా కూరక వ్యాఘ్రసుం గచుపులా గంతంత మిట్టెక్కి నె
మ్మదికి న్నెమ్మది దక్కి మీసములపై మాత్సర్యమున్ గ్రిక్కి సా
గవ యంచున్ దల గుక్కి పాలుకవులన్ గన్గొఁ జనన్ రాదె! యే
మిది! మీపూనిక యెందు డిందె!" నని పేర్మిన్ బల్కఁగాఁ గూడదే.

చ. అడిగెద మేము మి; మ్మడుగుఁ డట్టులె మమ్మును మీ, రటన్న వె
స్బడమి యదెట్టిదో! కపటపద్ధతు లుద్ధతు లెట్టివోక్కా! యీ
గడబిడ లేమి యయ్యెనోకో? కాలటు ద్రివ్వుట దేడ కేగెనో!
మడమలు ద్రొక్కి మీసమును మట్టునడావడు లేడ డాఁగెనో.

ఉ. "మీసము" లంచు మీసములమీఁదికిఁ బోవుటెకాక వారియ
ర్థాసనమందుఁ జేరుటకు నాసన మూఁచుటె కాక యెన్నియో

దోపపు బాసలన్ గిలికి తుండుడు కందుకె కాక పైరసా
భాసము చేసి పాఱు టిడి భావ్యమె కొప్పరపుంగవీశ్వరుల్.

చ. సమరము చూచి ఖేచరులు సంబర మంచుట యెందు విందు మ
య్యామరులువోలె సభ్యులు జయాపజయార్థులు గాక వారు ప్ర
శ్నము లిడ నెవ్వ "రద్గుఁడు పసన్ గనుఁ డగ్దెద" మంచు వారు స
క్రమముగ వ్రాయ నందులకుఁ గాక పరాఙ్ముఖులైతి రేటికో.

ఉ. గ్రుద్దె నఁ టాంజనేయుఁ డొక గుద్దును రావణుఁ బట్టి మూర్ఛపై
నద్దివిజారి జాతి తెలి సంది "బళీ" యని మెచ్చెనంట! యా
సుద్దికి నంజనాసుతుఁడు సుంతయు సంతస మంద 'కార! నా
గ్రుద్దురుచిన్ వచించు టొనఁగూడెనుగా!' యని వంచె వక్త్రమున్.

ఉ. "మీసము" లన్న "జు" ట్లనుచు మిమ్మను వా రన వచ్చుఁగాదె! యే
వాసియు లేనివారియెడఁ బంతము ప్రాజ్ఞుల కేల? మీ రసా
భాసపువ్రాఁతయే తెలుపుఁ బండితదూషు లటంచు; సర్వథా
దోసము మీది, మీ రిక నొదుంగక చేసెడి దేమి కైసరుల్.

చ. "గురుతరలీల" పద్య మది కో! యని యార్చుచు నుండె మీరె పై
బరు విడుకొన్న వారలు సభం బొనరించుటకంచు, నేల యీ
పిటికితనంబు సెప్పఁ డని బిట్టడుగన్ "లె" నంచుఁ బోయి కొ
ప్పరపు కవుల్ కనంబడక వచ్చిరి వాగ్మముఁ జూడ నంబరో!

చ. అపు డొకచోట విందునకునై చనియుంటిమి మేము మా నివా
సపదము చూచి 'వీరలును జాతిరొకో!' యని యాడుకొంచు 'న
ట్టిపనియు నుండునే!' యనుచు, డీకొని కొట్టెడి సేనపోల్కి న
య్యపరిమితప్రజానిచయ మయ్యెడ తే చనుదెంచె నంతటన్.

శా. అందున్ గొంపఱు బ్రాహ్మణుల్ మఱియు వైశ్యశ్రేష్ఠులుం గమ్మవా
రెందుం గన్పడి రిందఱున్ గవులకై యేతెంచుటంజేసి యం
దం దించించుక గోష్ఠి గల్గు టనుమేయం బయ్యె నోయంబ! మే
మెంగు న్మ్ర గ్గనియుండ మిందఱను దాదృగ్గిక్తిసంపన్నులన్.

ఉ. నాలవజాతియందలి జనంబులు తూర్పున నుండ్రి గాని యీ
నాలవజాతి వేఱు పయి నాగరికత్వముమాట కేమి వి

ద్యాలయములన్నఁ బ్రాణముల నర్పణ చేసెడిపాటిభక్తులుం
జాలఁ గలారు కమ్మకులజన్ములలో శతమున్ సహస్రమున్

ఉ. వారలు నన్యులుం గడు నవారిగ వీధికి రెండుప్రక్కలన్
బారులు గట్టి నిల్చి యిట వచ్చుట, కొప్పరిపువారిఁ జూడఁగాఁ
గోరికతోడ నేగి తమకున్ మతి వారగుపట్టమిన్ వృథా
గ్గై రహి నిండ్లకున్ మరలు టాదిగ నొండొరు లాడుకొం చొగిన్.

శా. అయ్యా! తిర్పతివెంకటేశ్వరులు! మే మత్యాశమై వేడ్క మీ
కయ్యంపున్ సభఁ జూడ వచ్చితి మిటన్, గా ల్ద్రివ్వినా రెవ్వరా
యయ్యల్ మోమును జాటు పెట్టి రిఁక మా యాయాసముల్ వ్యర్థమే
యయ్యెన్, వచ్చినత్రోవఁ బోవుదుమొ? లేదా, యుందుమో? తెల్పుఁడీ!

చ. ఎఱుఁగుదు మేము 'కొప్పర' మదెట్టిదొ? వారిని జూడ రాము, మి
మ్మెఱుఁగము మీదుపాత్రములు నింపెసలారు "ఫొటోలు" దక్క నేఁ
డరసితి మయ్యె ధన్యము భవాదిక; మూరక పో మ్మటందురో?
దరిసెన మిచ్చి నందులకుఁ దగ్గఫలం బొసఁగం దలంతురో?

చ. అనుచు ననేకభంగుల జనావళి మాపయిఁ గల్గు ప్రేమమున్
గనుపడఁ జేయుచున్, బలుకఁగా నపుడేము వసించుసౌధ మొ
య్యన డిగి నాటకాలయమునం దొక మేటిసభన్ బొనర్చి నే
ర్చినగతి వారికిన్ గలుగఁ జేసితి మగ్గల మైన మోదమున్.

సీ. 'తిరుపతివేంకటేశ్వరులఁ జూచితి' మంచుఁ బలుమాఱు సంతసంపడెడివారు
ఉవ్వెత్తుగా లేచి యొక్కదండములీలఁ బడి నమస్కారమ్ము లిడెడివారు
కొప్పరపువార లీగొడవఁ దెచ్చుట మేలె యయ్యెఁబో! యని పేర్మి నాడువారు
కయ్యంపుసభఁ జూడఁగలభాగ్య మిఁక లేదు వారుపాతీరటంచు దూఱువారు

గీ. పాటు కేమి యొనర్తురు వారికున్న
సరుకు నెఱుఁగ మెయని చర్చసలుపువారు
ఐనచోఁ గాలు ద్రవ్వ నేల నెడివారు,
అడుగు మవ్వారి నటకేగు మనెడువారు.

ఉ. అన్నిట వీరిదృష్టిని శతాంశము వారలుగారు దద్దడన్
దున్నకవిత్వమందు వలఁతుల్ మనవారలె యౌదు, రంచు; నే

మున్నది దానిలో ననుచు, నుండిన దేదియొ యున్న దంచు, నా
తెన్నొకకష్టమే యను, చుదీర్ఘతరమ్ముగ వాదులాడుచున్.

ఉ. ఏమియు రానివార లెటు లేది యొనర్చిన మంచి దౌ, సుధీ
గ్రామణు లట్లొనర్చు నెడ గ్రాంథికు లొప్పరు సాఁగఁ దీతు రిం
తే, మనవారు పోలె నలతిర్పతివేంకటపండితుల్ వచ
స్తోమము జార్చ లేరె యది దోసముగాఁ దలపోయ కుండుచో.

ఉ. జార్తురుగాక నో రెటులొ చయ్యన, నొయ్యన నట్లె పద్దెముల్
గూర్తురుగాక వీరు "చెవి గోసిన మేఁకల" పోల్కిఁ జాలనే
పార్తురె! డయ్యరే! యుభయు లంత బలాఢ్యులె? దేహదార్ఢ్యమం
దేర్తురు కొప్పరంపుఁ గవు లీకవియుగ్మము నొక్క వ్రేల్మిడిన్.

చ. అనునెడ దేహదార్ఢ్యమునకా యలవారలు గాలు ద్రివ్వి? రి
ప్పనియెడ నేను జాలనొకొ! పాండితియన్న భయమ్ము గాని వీ
రిని మఱి వారినిం గలిపి రేనియు నాబుజ మొక్కటే సుఁడీ
పనిఁగొని యాఁపు నం చొకఁడు బాహుబలాఢ్యుఁడు పల్కె నల్కనై.

క. అని వారి వారికిన్ దోఁ, చినగతిగాఁ "బిచ్చపాటి" చెప్పికొనుచు భో
జనపుం బసలకుఁ జని మఱు, దినమున నటనుండి బయలు దేఱిరి వారల్.

చ. సెలవును వ్రాసె స్కూలునకుఁ జెచ్చెర వెంకటశాస్త్రి మున్నె, యీ
కలహము దేలునంతకును గాల్గదలింప నటంచుఁ బంతముం
గలిగి వసించె నప్పురిని, గయ్యపుసంగతు లాలకించి శి
ష్యులు మఱికొంద ఱయ్యెడకుఁ జూడఁగ వచ్చి తనున్ భజింపఁగన్.

చ. సరసులు యోగ్యులౌ జనులు సంతతమున్ గవితాదరమ్మునై
నెరఁగుచు విందులన్ దనిపి యెంతయు గౌరవ మాచరింపన
ప్పుర మది వాసమై యచటిపూజ్యులకున్ దలలోని నాల్కయై
తిరుపతి యప్పు డప్పు డరుదేరఁగ, వెంకన యుండె నయ్యెడన్.

శా. "ఆసీమాంత మొనర్చి గాని విడువం డావెంకటేశుం" డటం
చాసీమన్ జనులెల్లఁ జెప్పికొన నిత్యమ్మున్ గవిశ్రేణి కెం
తే సంతోసము గూర్చుచున్ విమతు లంధీభూతచేతస్కులై
యీసున్ జెంది కృశింప మూఁడునెల లందే యుండె నద్దండతన్.

ఆ. వె. మొదటఁ గాలు పెట్టినది యల్ల * శిష్టా హ
నూమదార్య గేహసీమ, యచటి
నింబభూరుహంపునీడ సాక్షాత్కల్ప
పాదపంబునీడ గాఁ దనర్చె

ఉ. చాపలు నిండి బల్లలకుఁ జాలి రజఃకణకీలితంబు భూ
మీపద మాక్రమించి పయిమిక్కిలి వీధికిఁ దాఁకి గేహప్రం
దాపున నున్న యన్యసదనంబుల ప్రక్కల నిల్చి సారెకున్
శ్రీపతి వేంకటేశ్వరులు చేయుప్రసంగము విందు రెల్లరున్.

శా. అంబా! నింబము నీనివాస మదియో? యభ్రంకషానూనశా
ఖం బచ్చో నెపుడీవు పొల్చుటది నిక్కంబే, భవత్సాక్షికం
బుం బూజ్యాశయసాక్షికంబు నగుచుం బొల్పారు తత్తత్సభా
లంబంబౌ కవితాప్రసార మది యేలా నొక్క వాక్రుచ్చుటల్.

మ. ఎటు నీభక్తులవాఙ్మధుద్రవము లందే పారె, శత్రుప్రజం
బటుకున్ వచ్చి మనంబునందు నెటు "ఛీ" లౌవార, లాక్రోశప్రపుం
గటువాక్యమ్ముల కెట్లు వారురక దుఃఖం బందువా, రెట్టుగా
గుటకల్ మ్రింగెడివారొ? నీమది యెఱుంగున్, జెప్పఁగా నేటికిన్.

ఉ. ఐనను శాఖ బాధ కయి యావలికిం జని తప్పుచొప్పులన్
బూని యవాచ్యముల్ గిలికి పుచ్చియు నెమ్మన మాఁగ లేక మా
పై నెనరున్నయట్టులుగ వచ్చి రసం బది గ్రోలి పోవు వా
రేని యథార్థముం దెలియ నెల్లరు నీవును డాఁగురింతురే?

చ. ఎలమి వచించి తీరవలె నీకపటాత్మలసత్స్వభావ; మీ
యలఘుల కేము శత్రువులమై మఱి మావచనంబు లెట్లు వీ

---

(గుంటూరినుండి బయలుదేఱు సమయమునఁ జెప్పినది.)

*సీ. తిరుపతి వెంకటేశ్వరుని కొండకు నీకు భేదమే కనుపట్టలేదు తల్లి, శ్రీశైలమల్లేశు శిఖరమ్మునకు నీకు భేదమే..., మధురమీనాక్షి వేశ్మస్థలికిని నీకు భేదమే..., కాశికావిశ్వేశు గర్భగుడికినీకు భేదమే... తల్లి, తే॥ గీ॥ ఎట్టి సుముహూర్తమందుఁ దాఁగట్టెనో కో, ఘనుఁడు శిష్టాహనూమదాఖ్యాక సుకవి, అడుగు పెట్టిన దాది బ్రహ్మసభఁ జేసి, పంపుచుంటివి నినువీడవలసె నేఁడు. (వెం॥ శా)

నులకు రసాయనంబు లగునో? యవి జీర్ణము లైనవెంట లే
ఖిల కపవాదముల్ గిలుకఁగాఁ గరముల్ దిరుగాడు నెట్టులో!

క. ఖిలజనులవర్తనములకుఁ, దలయాని తోఁక యని చెప్పఁ దరమే? యలపా
పులకేమి నింబకుజభూ, తలసభ లవి యెంతికేని దగు జగదంబా!

చ. అరు లగువారి కిట్టు లెదయందలికుంపటివోలె నుండి యా
తిరుపతి వెంకటేశ్వరులు "తీర్పరులన్ బిలిపింపుఁడీ, సభన్
జరుపుఁడి మీసముల్ వెఱుకఁ జాలినచోఁ బెఱుకుండ" టంచుఁ దీ
వరముగఁ జెప్పఁ గొప్పరపువారిబడాయి క్రిచుక్రమమ్ముగన్.

ఉ. తగ్గి యిదెట్టులేనియును దప్పికొనన్వలె నంచు నంతటన్
బగ్గెలు వ్రాయమాని తమపక్షము దుర్బలమౌట నెట్టులు
న్నెగ్గ దటంచు లో నెఱిఁగి * నెయ్యుఙకుం గడు గూఢవృత్తిపై
నగ్గతి డాఁచి స్నేహ మగు టర్హ మటంచు లిఖించుచు న్వెసన్.

చ. పయికిఁ బ్రగల్భవాక్యములె పల్కుచు నప్పురమందె తీరికన్
గయికొని కూరుచుండిరి ప్రకంపితమైన మనంబు చంపమె

---

చెన్నపురి; లైబ్రిరీ, గురువారం

*...నిన్న కొప్పరపుంగవులు నాపేర 8 పేజీల ఉత్తరం వ్రాసినారు, వివాదప
త్రమును వ్రాసినారు. తమదోషము లేశమును లేదనియు వెం॥ శా॥ అన్యాయ
ముగా గర్వించిరనియు, మొదలుగా వ్రాసినారు. దాని వైఖరిచూడఁగా వివాదము
నుండి తప్పించుకొనుట కిష్టపడుచున్నారని దోఁచుచున్నది. అట్టి ప్రయత్నము
న్నచో తప్పక మీరును అంగీకరింప వేఁడెదను. ఈ వివాదసభలు కావ్యకారులు
కావు. నడుమ వారికి పండువు, పోరాడువారికిర్వురకు శ్రేయము కన్పడదు.
ఈ సభలలో తీర్పుతీర్చువారెవరు? ఎట్లుసాగును? "లోకోభిన్నరుచిః" తత్రా
ఽపి స్వస్వపక్షాభిమానో బలవాన్ బాధతే. వారు 'ఛాలెంజి' ప్రచురించినం
దుకు, శివరామశాస్త్రి వరల ప్రచురించెను. ఇంతట నాఁగిన బాగుండునని
నేను తలంతును నాప్రార్థన మిదియే. ... ఏవిధముననైనను తగవుమాపుకొనుట
బాగు. నేను వారికేమని సమాధానము వ్రాయుటకును పాలుపోకయున్నాను.
జవాబు వెంటనే వ్రాయించవలెను,...."

వే॥ ప్రభాకరుఁడు.

ల్ల యెడల నెల్లరుం దెలిసి “లావతీ” రంచు వచించుచుండు న
ప్రియములు పూర్తిగా వినియు బీరము మానర వారు మాటలన్.

ఉ. అంతట వారిపక్షమున కాదరు వౌ కులవృద్ధుఁ “డక్కటా!
యంతన తేలిపోవు నని యంపు మటంటిమి పత్రి మల్లవా
రెంతటిపట్టు పట్టిరొకో ? యిప్పురి వీడను కొప్పరంపువా
రెం తలవారి ధాటి? కిపు డేమనుకొన్న మతేమి లాభమా.

మ. పులిపై జడ్డను వేసి చెట్టుపయికిం బోవన్ వెసన్ దత్కుజ
స్థలమందే యది పీఁట వెట్టి యెట్టులో సాధించుఁ గాదే పగన్
దొలి నాలోచన చాల దయ్యె నపు డేదో హానియు మన్నార మి
ప్డలఁతిం బోకది “యేకమే” క నెడిసామ్యం బయ్యె నెట్లో కదే!

ఉ. పాపము! “వారిదాసులము వారలలోన శతాంశమేనిఁ గా
మోపము వారి” కంచు నతియోగ్యుఁడు కొపరిపుజ్యేష్ఠుఁ డప్పు తా
నోపిన యంతపట్టు మొగమోడక చెప్పె; వృథాభిమానపుం
దాపము నాఁడు మామదికిఁ దద్వచనమ్ముల నెక్కనీ దహో!

ఉ. ఎంతటి ధైర్యమున్ మఱియు నెంతటిశక్తియు లేక యున్న ని
శ్చింతగ నాఁటి సత్సభ “ననేమిర వారల కాసనంబు మా
కెంత ఘటింపఁ గూడ” దని చెప్పఁగ నేర్చెనె ? వేయుసీమ య
న్నంతన పుట్టి పలదా ? కలదా? యిటువంటిచేవయున్.

చ. ప్రముఖుల మెంతమంది పని పట్టితి మక్కట! వారిముందు మా
అ మయితి మింత కెంతటిపరాభవ ? మూరక కొప్పరంపువా
రి మొరప మిక్కుటమ్మునఁ బోరిం బోరిఁ దగ్గఁగఁ జొచ్చెనే యుపా
యమునన్ వీరిపైఁ బడునపాయముఁ బాయఁగఁ జేయఁగా వలెన్.

మ. * అని యోజించుచు నుండె నంత నొకనాఁ ప్రసంగంబు నె
ల్లను విన్పింప సభం బొనర్చి తగుహేలన్ విన్కి సేయంగ వ
చ్చినవా రెల్లరుఁ బత్రికల్ వినుచు మంచిన్ జెడ్డ యోజించుచుం
డు నెడన్ గొందఱు వచ్చి రయ్యెడకు నెట్లో యాసవ స్సాఁగఁగన్.

* నిష్పక్షపాత హృదయులును యథార్థపరిజ్ఞాతలును గుంటూరు పురవాస్తవ్యులు నగు నార్య సోదరులారా! కొప్పరపువారు ప్రతిజ్ఞా పూర్వకముగా

